# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.



అలసట పోయి
హుషారు కలగాలంటే...

మీరూ అంగీకరిస్తారు

# టాటా-ఫిన్లే

## టీ

సాటిలేని టీ!

టాటా-ఫిన్లే టీ కంటె తృప్తికరమైన దేముంది! ఇందుకు కారణాలు:—

### తాజా టీ

తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

### పరిమళమైన టీ

అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

### ఉత్తమ టీ

టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** *టీ త్రాగండి; ఆనందము అందుకోండి!*



ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టీజ్ డార్జిలింగ్—సుందరమైన టిన్
లలిత్—బంగారు రంగు ప్యాకెట్
మిలాప్—వెండి రంగు ప్యాకెట్
బహదూర్—నారింజ రంగు ప్యాకెట్
షాన్—నీలి రంగు ప్యాకెట్



# దిలీపు బృందం చేరుకొన్నారు



























JWTUC 1652

నాడు మీరు మెచ్చిన నవల
కోడూరి కౌసల్యాదేవి రచన "చక్రభ్రమణం"
నేడు మీరు మెచ్చే చిత్రం

అన్నపూర్ణా వారి

# డాక్టర్ చక్రవర్తి

నిర్మాత డి. మధుసూదనరావు B.A. ❋ దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు

సంగీతం: ఎస్. రాజేశ్వరరావు
నిర్మాణం: శ్రీ సారథీ స్టుడియోస్ హైదరాబాద్
నవయుగ విడుదల



# ప్రశ్నోత్తరాలు

CHITRA

1. డి. కృష్ణమూర్తి, బంగళూరు

"చందమామ" ఎప్పుడు పుట్టెను ?

ఈ సంచికతో "చందమామ"కు సరిగా 17 ఏళ్లు నిండుతాయి. "చందమామ" పుట్టింది 1947 జూన్ ఆఖరులో.

రాకెట్ అనగా నేమి ?

రాకెట్ తారాజువ్వ పంపిణీలో నిర్మించిన సాధనం. ఇంధనం దహనం పొంది వాయు రూపంలో ఒక దిక్కుగా వెలువడేటప్పుడు, దాని ప్రతిక్రియా శక్తితో రాకెట్ రెండవ పక్కగా నడుస్తుంది. రాకెట్ ఇంజన్లలోనూ, ఇంధనాలలోనూ ఇటీవల జరిగిన అభివృద్ధి ఫలితంగా మానవులు రాకెట్లను ఇతర గ్రహాల వద్దకుకూడా పంప గలుగుతున్నారు.

2. వి. దామోదరన్, కోడూరు

సుమారు రెండు నెలలుగా రాత్రులలో 7-00 మొదలు 8-30 గంటలలో తార లాంటి ప్రకాశవంతమైన ఒక వస్తువు ఉత్తరమున ఉదయించి, 20 నిముషముల సేపు పయనించి, దక్షిణమున అదృశ్యమగుచున్నది. ఇదేమిటో సెలవిస్తారా ?

ఇలాటిది మేము గమనించలేదు. కాని మరికొందరు పాఠకులు కూడా ఇలాటి ప్రశ్నలే వేశారు. ఉదాహరణకు, నర్సరావుపేట నుంచి కె. జె. నరసింహరాజు ఇలా రాశాడు : "23-4-64 తేదీ రాత్రి 7-40, 7-50 మధ్య ఆకాశంలో అతి వేగంగా పయనించిన ఒక చుక్కను చూశాను. నేను చూసేటప్పటికి సరిగా నెత్తిమీద ఉంది. అవతల ఎంత దూరంనుంచి అది పయనించినదీ నేను చూడలేదు. ఆ చుక్క ఒకటి రెండు చుక్కల పక్కగా అతి వేగంగా ఉత్తరంనుంచి దక్షిణం వైపుకు పయనిస్తూ, సూర్యుడు అస్తమించిన విధంగా భూమిచాటుకు వెళ్ళిపోయింది."

బల్లా నుంచి బి. సాంబశివరావు అనే పాఠకుడు ఏప్రిల్ 12 న ఒక నక్షత్రం కొంత దూరం ప్రయాణించి అంతర్ధానమైనట్టు చూశాడు.

మీరందరూ చూసినది నక్షత్రం అయి ఉండటం అసంభవం. ఉల్కలు చాలా సేపు కనిపించవు, అవి నక్షత్రాలలాగా ఉండవు. అందుచేత అవి రాకెట్లు గాని, విమానాలు గాని అయి ఉండాలి. పత్రికలలో వాటిని గురించిన వార్తలు పడకపోవటం ఆశ్చర్యకరం.

3. పర్సు రాజరత్నము, మదరాసు

దశరథ మహారాజు భార్య అయిన సుమిత్ర ఏ రాజు కూతురు అనునది మాకు దయచేసి తెలుపవలెను.

ఆ విషయం వాల్మీకి గానీ ఇతరులు గానీ చెప్పి ఉండలేదు.

4. *వరహాల రాజేశ్వర్, అంబం కాంప్*

"చందమామ"లో ప్రచురించే బేతాళ కథ క్రింద రచయిత పేరుండదు. కారణం? బేతాళ కథ వ్రాయడానికి అందరు అర్హులేనా? దయచేసి తెలియజేయగలరు.

బేతాళ కథలు హెచ్చు భాగం "చందమామ" కార్యాలయంలోనే తయారవుతున్నాయి. పాఠకులు పంపిన బేతాళ కథలు కూడా కొన్ని వేశాం. వారి పేర్లు సంపాదకీయంలో వివరించాం. బేతాళ కథలను ఎవరైనా పంపవచ్చు.

5. *యస్. కాంతారావు, వెంకటగిరి*

ఈ కాలములో ఒక లోహమును భూమినుండి త్రవ్వి తీయుట మొదలు వస్తువుగా చేయుట వరకు ఎన్నెన్నో భారీ యంత్రములు, సున్నిత యంత్రములు ఉపయోగించుచున్నారు. ఆ కాలములో ఈ యంత్రములు లేవే? మరైతే వారు లోహములతో వస్తువులను ఎలా చేసుకోగలిగారు?

తొలి కాలపు మానవులు భూమిపైన ఏరుకోవటానికి వీలుగా ఉన్న లోహాలనే ఉపయోగించుకున్నారు. మిశ్రధాతువులను శుద్ధి చెయ్యటానికి నిప్పునూ, రసాయనాలనూ ఉపయోగించే మార్గాలు కూడా చాలా శతాబ్దాల క్రితమే కనిపెట్టబడ్డాయి. పరుసవేది కోసం అన్వేషించిన వారి ద్వారా రసాయన శాస్త్రం అభివృద్ధి చెందింది. లోహ పరిశ్రమ యంత్ర పరిశ్రమగా అయినదీ, లోతైన గనుల నుంచి ముడి లోహాలు తవ్వటం ఆరంభమయినదీ ఈ యుగంలోనే.

ప్రపంచములో ఈ నాడు దొరకుచున్న కోట్లకొలది రూపాయల విలువ గల అభ్రకము యొక్క ఉపయోగ మేమిటి?

అభ్రకానికి రెండు ప్రధాన గుణాలున్నాయి: అది విద్యుత్తును నిరోధిస్తుంది; హెచ్చు వేడికి కూడా తట్టుకుంటుంది. ఈ రెండు లక్షణాలతోబాటు దానికి కొంత పారదర్శక గుణం కూడా ఉన్నది. అనేక యంత్రాలలోనూ, యంత్రపరికరాలలోనూ, ఎలెక్ట్రికల్ ఇంజనీరింగులోనూ అభ్రకం ఎంతైనా అవసరం. హెచ్చు వేడిగల దీపాలకు గాజుకవచం పనికి రాని చోట అభ్రకపు కవచం పనికి వస్తుంది.

6. *టి. వి. రమణశాస్త్రి, మృత్యుంజయనగరం*

అన్నయ్యా, "దుర్గేశనందిని" రచయిత పేరున్నూ, అది ఎన్ని నెలలు ప్రచురిస్తారో దయచేసి చెప్పవలెను.

"దుర్గేశనందిని" బంకించంద్ర చట్టోపాధ్యాయ రచన. "చందమామ"లో సుమారు ఒక సంవత్సరం పాటు వెలువడవచ్చు.

7. *యస్. నజీముద్దీన్, అమలాపురం*

చందమామలో ఆకర్షణ శక్తి ఉందా?

దానికి సందేహమెందుకు, భాయ్?

Energy Food

J.B.MANGHARAM'S
Salto
Biscuits

J.B.MANGHARAM'S
Luxury Assortment

TEA TIME

J.B.MANGHARAM'S
POPULAR ASSORTED

ప్రయాణము
ఎంతో
ఆనందముగా
అవుటకు...

జె.బి. మంఘూరామ్స్ వారి
ప్రసిద్ధిగాంచిన బిస్కట్లను
మరియు మిఠాయిలను తీసుకు వెడితే
మీ ప్రయాణము ఆనందముగా
అయిపోతుంది. ఇవి ప్రత్యేకమైన,
పుష్టికరమగు పదార్థములతో
తయారుచేయబడినవి.

# జె. బి. మంఘూరామ్స
## బిస్కట్లు

ఇవి దాదాపు అన్ని
రెస్టారెంట్లలోను మరియు
కేంటీనులలోను
లభిస్తున్నాయి.

జె. బి.
మంఘూరామ్
అండ్ కం.
గ్వాలియర్ &
హైదరాబాదు

# "చాచా" నెహ్రూ

ఈనాడు "చాచా" నెహ్రూ అంటే ప్రపంచంలోని పిల్లలందరికీ తెలుసు. భారత ప్రధాని నెహ్రూ నెరగని పెద్దలు కూడా ఏ దేశంలోనూ ఉండరు. ఆయన రాజకీయ జీవితం 50 ఏళ్ళలో 30 కి పైగా జాతీయోద్యమంలోనూ, పదిహేడేళ్ళు స్వతంత్ర భారతానికి అగ్రనాయకుడుగా ఉండటంలోనూ గడిచిపోయాయి. 1929 లో మొట్టమొదటిసారి కాంగ్రెసు అధ్యక్షుడు అయినది మొదలు ఆయన జాతీయోద్యమ అగ్రనాయకుల జాబితాలో చేరి, జాతిపిత గాంధీకి రాజకీయ వారసత్వం పొంది, చిట్టచివరి క్షణం దాకా ఆ అగ్రస్థానాన్ని నిలబెట్టుకున్నాడు.

నెహ్రూ ఆదర్శాలు భారతదేశపు భవిష్యత్తునే గాక, ప్రపంచపు భవిష్యత్తుకే, మహోత్కృష్ట మైనవి. దేశాల మధ్య శాంతి, సౌహార్దాల కోసమూ, పరస్పర సహకారం కోసమూ, వలస విధానమూ, ఫాసిజమూ మొదలైన దుష్టశక్తు లంతమై, సామాన్య ప్రజల జీవితం సుఖమయం కావటం కోసమూ నెహ్రూ కలలు కన్నాడు.

భవిష్యత్తు పైన నెహ్రూకు గల విశ్వాసం అపారమైనది. ప్రపంచంలోని పిల్లలే ప్రపంచపు భవిష్యత్తు. వారంటే నెహ్రూకు అంతులేని ప్రేమ. అందుచేతనే ఆయన తన జన్మ దినం, నవంబరు 14, బాలలదినంగా జరపమని కోరాడు. ఆ ప్రకారమే మనం ఆయన జన్మ దినాన్ని బాలల దినంగా జరుపుకుంటున్నాం.

నెహ్రూ అస్తమయం ప్రపంచాన్నే అంధకారంలో ముంచిందంటే మన దేశం మాట చెప్ప నవసరం లేదు. కాని నెహ్రూ ఆదర్శాలూ, ఆశయాలూ, జీవితమూ మనకు అరని జ్యోతిగా ఉండి, తమ వెలుగులో మనను ముందుకు నడిపించ గలవు.



# నెహ్రూ అస్తమయం



జననం 14-11-1889 మరణం 27-5-1964



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచిక నుంచి "దుర్గేశనందిని" అనే చరిత్రాత్మక నవల రంగుల బొమ్మ సీరియల్‌గా ప్రారంభమవుతున్నది. ఈ నవల రచించినది సుప్రసిద్ధ బెంగాలీ నవలాకారుడు బంకిమ్‌చంద్ర చట్టోపాధ్యాయ. ఈయన బెంగాలీ నవలా సాహిత్యానికి ప్రాణప్రతిష్ఠ చేశాడని చెప్పవచ్చు. ఈ కథ అక్బరు పాదుషా కాలంలో జరిగినట్టు భావించాలి. "దుర్గేశనందిని" అన్ని భారతీయ భాషలలోకీ చాలా కాలంగా అనువదించబడి ఉన్నది.

సంపుటి 34 జూన్ 1964 సంచిక 6









# భారత చరిత్ర



విజయనగర సామ్రాజ్యపు ఆరంభ దశను గురించి గాథలే తప్ప చారిత్రకమైన ఆధారాలు తక్కువ. ఈ గాథలలో కూడా వ్యత్యాసాలున్నాయి. సంగముడనే వాడికి అయిదుగురు కుమాళ్ళుండేవారనీ, వారిలో హరిహరరాయలూ, బుక్కరాయలూ ప్రఖ్యాతులనీ, అయిదుగురు అన్నదమ్ములూ కలిసి, తుంగభద్రానది దక్షిణపు గట్టున, ఉత్తరపు గట్టున ఉన్న ఆనెగొంది దుర్గానికి ఎదురుగా, విజయనగరాన్ని నిర్మించి, విజయనగర రాజ్యానికి పునాది వేశారన్నది సర్వత్రా ఆమోదించబడుతున్నది. వీరిని నగరస్థాపనకూ, రాజ్యస్థాపనకూ పురికొల్పిన వారు మాధవ విద్యారణ్యులనే బ్రాహ్మణ పండితుడూ, ఆయన తమ్ముడు, సాయనుడూ అని చెబుతారు. ఈ సాయనుడే వేదభాష్యం రచించాడు. ఈ అయిదుగురు అన్నదమ్ములూ తెలుగు దేశానికి చెందిన వారనీ, వీరు కాకతీయుల ఓరుగల్లు రాజ్యం నుండి కాందిశీకులై తుంగభద్రా తీరానికి వచ్చారనీ కొందరు చెబుతారు. ఏమైనా ఒకటి నిజం: హరిహరరాయలూ, బుక్కరాయలూ, వారి ముగ్గురు తమ్ములూ ఉత్తరం నుంచి మహమ్మదీయులు చేసే దాడులను ప్రతిఘటించటానికి తీవ్రంగా కృషి చేశారు. దీని ఫలితంగా, భారత దేశపు ఇతర ప్రాంతాల విజృంభించిన పరమత, పరసంస్కృతుల ప్రభావాన్ని అరికట్టి, దాదాపు మూడు శతాబ్దాల పాటు ప్రాచీన భారతీయ మత సంస్కృతులను విజయనగరం పరిరక్షించింది; బహ్మనీరాజ్య ప్రభావాన్ని దక్షిణం నుంచి ప్రతిఘటించి, ఆ ప్రభావం ఉత్తర దేశానికి వ్యాపించకుండా అరికట్టింది. "ఆ కాలపు రాజకీయ పరిస్థితికి ప్రధాన కీలకం విజయనగరమే" అన్నారు

## 33. విజయనగర సామ్రాజ్యం

చరిత్రకారులు. ఇదే భారత చరిత్రలో విజయనగరానికి గల ప్రాముఖ్యానికి ముఖ్య కారణం.

విజయనగరాన్ని పాలించిన మొదటి రాజులు సంగమవంశం వారు. మొదటి హరిహరరాయలూ, మొదటి బుక్క రాయలూ పాలించిన కాలంలో హొయసల రాజ్యంలో అత్యధిక భాగం విజయనగరంలో చేరిపోయింది. అయితే హరిహరరాయలు గాని, బుక్కరాయలు గాని పూర్తిగా రాజరికం చలాయించలేదని చెబుతారు. 1374 లో బుక్కరాయలు చీనాకు రాయబారం పంపాడు. 1378-79 లో ఇతని మరణానంతరం ఇతని కొడుకు రెండవ హరిహరరాయలు రాజ్యానికి వచ్చి, "మహా రాజాధిరాజ, రాజపరమేశ్వర" వగైరా బిరుదావళి తగిలించుకున్నాడు. ఇతని పరిపాలనలో సమగ్రశాంతి ఉండినట్టు ముస్లిము చరిత్రకారులు రాశారు గాని, శాసనాలను బట్టి ఇతని కాలంలో విజయనగర సామ్రాజ్యానికీ, ముస్లిములకూ ఘర్షణలు జరిగినట్టు తెలుస్తున్నది.

బహ్మనీ రాజ్యంలాగే విజయనగర రాజ్యం కూడా అనేక రాజ్యాలతో విడవకుండా యుద్ధాలు చేస్తూ వచ్చింది.



1398 ఆఖరులో రెండవ హరిహరుడి కొడుకైన రెండవ బుక్కరాయలు తండ్రి అనుమతితో, కృష్ణా తుంగభద్రల మధ్య ప్రాంతమైన రాయచూరును పట్టుకొనటానికి బహ్మనీ దేశం పైకి ఉత్తరంగా దండెత్తి వెళ్ళాడు.

ఈ ప్రాంతం కొరకు బహ్మనీ, విజయనగర రాజ్యాలు మొదటి నుండీ యుద్ధానికి తలపడుతూ వచ్చాయి.

అయితే ఈ యుద్ధంలో రెండవ బుక్కరాయలు ఫీరూజ్ షా బహ్మనీ చేతిలో ఓడిపోయి, 1399 మధ్యలో పెద్ద పరిహారం చెల్లించి సంధి చేసుకున్నాడు.

అయినప్పటికీ రెండవ హరిహరుడి కాలంలో విజయనగర రాజ్యం దక్షిణ భారత మంతటా విస్తరించింది. మైసూరూ, కన్నడ ప్రాంతమూ, చంగల్పట్టూ, తిరుచిరాపల్లీ, కంచీ విజయనగర రాజు ఏలుబడి కిందికి వచ్చాయి. రెండవ హరిహరుడు శైవుడు, విరూపాక్షస్వామిని ఆరాధించే వాడు, అయినా పరమతసహనం కలవాడు. ఈయన 1406 ఆగస్టులో చనిపోయాడు. ఆయన అనంతరం ఆయన కుమారుల మధ్య రాజ్యాధిపత్యం కొరకు తగాదా జరిగింది. చివరకు 1406 నవంబరు 5 న మొదటి దేవరాయలు సింహాసనం అధిష్ఠించాడు. ఇతను బహ్మనీ సుల్తానులతో కొన్ని యుద్ధాలలో ఓడిపోయి, 1422 లో చనిపోయాడు.

ఇతని అనంతరం ఇతని కొడుకైన విజయ బుక్కరాయలు (లేక వీరవిజయుడు) కొద్ది నెలలు మాత్రమే రాజ్యం చేశాడు. తరువాత ఇతని కొడుకు రెండవ దేవరాయలు రాజ్యానికి వచ్చాడు. ఇతను బహ్మనీ రాజులతో చేసిన యుద్ధాలలో ఓడిపోయి నష్టపడినప్పటికీ, తన పరిపాలనా విధానాన్ని పూర్తిగా పునర్వ్యవస్థీకరించాడు. బహ్మనీ రాజుల పై పోటీగా ఇతను ముస్లిములను తన సేనలో చేర్చుకున్నాడు; వర్తకాన్ని క్రమబద్ధం చెయ్యటానికిగాను, తన "కుడి భుజ"మైన లక్కన్న (లక్ష్మన్న) అనే వాణ్ణి "దక్షిణ సముద్రాధిపతి"గా నియమించి, సముద్ర వ్యాపార మంతా అతని చేతిలో ఉంచాడు. 1420 లో ఒక ఇటలీ దేశపు యాత్రికుడూ, 1443 లో పర్షియా దేశపు రాయబారీ విజయనగరానికి వచ్చారు. వారిద్దరూ కూడా విజయనగరాన్నీ, విజయనగర సామ్రాజ్యాన్నీ గొప్పగా మెచ్చుకుంటూ రాశారు. ఆ కాలానికి విజయనగర సామ్రాజ్యం దక్షిణ భారతమంతటా విస్తరించి, సింహళతీరం దాకా వ్యాపించింది. ఇది విజయనగర సామ్రాజ్యపు ఉచ్చ దశ.





# ప్రహ్లాదుడు

## 2

హిరణ్యకశిపుడు తపస్సు చేయబోయే సమయానికి అతని భార్య లీలావతి గర్భవతి. ఆ సమయంలోనే ఇంద్రుడు విజృంభించి రాక్షసుల పై యుద్ధంచేసి ఓడించి, లీలావతిని పట్టుకున్నాడు.

అప్పుడు నారదుడు వచ్చి ఇంద్రుడితో, "ఈమె పరమసాధ్వి, మహాపతివ్రత. ఈమె నెందుకు పట్టుకున్నావు? విడిచిపెట్టు," అని చెప్పాడు.

"ఈమె గర్భాన కొడుకున్నాడు. వాణ్ణి చంపి ఈమెను విడిచిపుచ్చుతాను," అని ఇంద్రుడు సమాధానం చెప్పాడు.

"ఈమె గర్భాన ఉన్నవాడు గొప్ప హరిభక్తుడు," అని నారదుడు చెప్పిన మీదట ఇంద్రుడామెను విడిచిపెట్టాడు. నారదుడామెను తన ఆశ్రమానికి తీసుకుపోయి అక్కడ ఆమెకు తత్వోపదేశం చేశాడు. లీలావతి గర్భంలో ఉన్న శిశువు కూడా ఆ తత్వాన్ని గ్రహించింది.

ఆ శిశువే ప్రహ్లాదుడు. హిరణ్యకశిపుడికి ప్రహ్లాదుడితో సహా నలుగురు కొడుకులు. మిగిలినవారి పేర్లు అనుహ్లాదుడు, సంహ్లాదుడు, హ్లాదుడు. వారిలో ప్రహ్లాదుడు జగత్ప్రసిద్ధుడు. అతను శీలవంతుడు, శాంత వినయ దయాదిగుణాలు గలవాడు, అసుర లక్షణా లేవీ లేనివాడు. అన్నిటినీ మించి అతనికి దైవభక్తి పుట్టుకతోనే వచ్చింది. ఆడుకుంటున్నా, తింటున్నా, తాగుతున్నా, నిద్రిస్తున్నా అతని మనసు హరిపైనే ఉండేది. హరి చింతలో అస్తమానమూ మునిగి తేలుతూ ప్రహ్లాదుడు ఏదో పాడుకునేవాడు, ఒకప్పుడు నృత్యం చేసేవాడు, ఎవరో పిలిచినట్టుగా పలికేవాడు, ఉన్నట్టుండి కంట నీరుపెట్టుకునే

అట్ట చివరి బొమ్మ



వాడు, ఒకప్పుడు మౌనంగా ఉండి పోయేవాడు.

రాక్షసులకు గురువైన శుక్రుడికి చండుడూ, అమర్కుడూ అని ఇద్దరు కొడుకు లుండేవారు.

వారు హిరణ్యకశిపుని ఇంటనే ఉండి, ఇతర పిల్లలతోబాటు ప్రహ్లాదుడి చేత కూడా రాజ నీతి చదివించారు.

ప్రహ్లాదుడు గురువులు చెప్పినది చదువు కున్నాడన్న మాటేగాని, ఆ చదువులో అతనికి ఏమీ నమ్మకం లేదు.

ఒకనాడు హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి ఒళ్ళో కూచోబెట్టుకుని, "నీవు చదువు కుంటున్న విషయాలలో నీకు ఉత్తమంగా తోచినదేమిటో చెప్పు," అన్నాడు.

దానికి ప్రహ్లాదుడు, "నాన్నా, భ్రమ జనితమైన అహంకారంతో ఆరాటపడే ప్రాణులు చీకటి బావి లాటి ఇంటిని వదిలి పెట్టి ఏ అడవికో వెళ్ళి హరిధ్యానం చేసు కోవటమే నాకు అన్నిటికన్న ఉత్తమంగా తోస్తున్నది," అన్నాడు.

హిరణ్యకశిపుడు గట్టిగా నవ్వి. "పిల్లల మనసు ఎటుపడితే అటు సులువుగా తిరుగు తుంది! ఎవరో హరి భక్తులు రహస్యంగా వీడి బుద్ధిని మార్చేస్తున్నారు. అలాటి దేమీ జరగకుండా వీడికి విద్యాబోధ చెయ్యండి," అని గురువులను హెచ్చరించాడు.

చండామర్కులు ప్రహ్లాదుణ్ణి విద్యా గృహానికి తీసుకుపోయి, మృదువుగా, "బాబూ, నీవు చాలా బుద్ధిమంతుడవు. అబద్ధం ఆడకుండా చెప్పు, నీ కిలాటి ఆలోచ నలు ఎవరైనా చెబుతున్నారా? లేక నీకే కలుగుతున్నాయా? మిగిలిన పిల్లలు ఇలాటి మాట లెప్పుడూ అనరే?" అని అడిగారు.

"భగవంతుడు కల్పించిన మాయచేతనే తన, పర అనే భేదభావం కలుగుతుంది. ఈ భ్రమ బ్రహ్మ అంతటి వాణ్ణికూడా బాధి స్తుందంటే మామూలు మనుషుల సంగతి

చెప్పే దేమిటి? అయస్కాంతం ఇనుమును లాగినట్టుగా హరి నా మనస్సును అస్తమానమూ ఆకర్షిస్తున్న కారణం చేతనే మీరు చెప్పే చదువుకూ, నాకు కలిగే భావాలకూ భేదం ఉంటున్నది," అని ప్రహ్లాదుడు బదులు చెప్పాడు.

"ఓరి దుర్మతీ! మా కపఖ్యాతి తేవటానికి నువ్వెక్కడ దాపరించావురా! చందనవనం లాటి దైత్య వంశానికి గొడ్డలి అయిన ఆ విష్ణుమూర్తికి కర్రలాగా పుట్టుకొస్తివే! ఏదిరా బెత్తం?" అని గురువులిద్దరూ ప్రహ్లాదుణ్ణి భయపెట్టి విద్యాబోధ సాగించారు.

వారతనికి ధర్మార్థకామాలను గురించి చదివించి, సామదానభేద దండాలనే చతురోపాయాలు అతనికి బాగా వచ్చాయని తోచినమీదట, నలుగుపెట్టి స్నానం చేయించి, మృష్టాన్న భోజనం పెట్టించి, హిరణ్యకశిపుడి వద్దకు తీసుకుపోయారు.

హిరణ్యకశిపుడు కొడుకును ఒళ్లోకి తీసుకుని, లాలించి, వెనకటిలాగా, "బాబూ, నీవు చదివిన దానిలో నీకు బాగా నచ్చిన అంశ మేమిటి? ఉత్తమంగా తోచిన దేమిటి?" అని అడిగాడు.

దానికి ప్రహ్లాదుడు, "హరిశ్రవణమూ, కీర్తనమూ, స్మరణమూ, పాదసేవనమూ,



అర్చనమూ, వందనమూ, దాస్యమూ, సఖ్యమూ, ఆత్మసమర్పణమూ అనే తొమ్మిది విధాల భక్తియోగం ఆచరించటమే చదువులన్నిటిలోకీ మేలైనదని నా నమ్మకం," అన్నాడు.

హిరణ్యకశిపుడు కోపోద్రేకంతో, "బ్రాహ్మణాధములారా, నేనంటే అంత అలక్ష్యమా? కుర్రవాడికి మీరు నేర్పే విద్య ఇదా?" అని గర్జించాడు.

"మహారాజా, ఆగ్రహించ వద్దు. వీడు చెప్పే విషయాలు మేము నేర్పినవీ కావు, ఇతరులు చెప్పినవీ కావు. అవి వాడికి పుట్టుకతోనే వచ్చి ఉండాలి. మా తప్పు ఇందులో ఏమీ లేదు," అని గురువులు విన్నవించారు.

చండామర్కులు యిలా చెప్పగానే హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడితో, "దుర్మార్గుడా, గురువులు చెప్పకుండా నీకీ ఉద్దేశాలు ఎలా కలిగాయిరా?" అన్నాడు.

"ఇంద్రియాలకు లోబడి సంసారసాగరంలో మునిగి తేలే వారికి హరిభక్తి దానంతట అదిగాగాని, ఇతరులు చెబితేగాని కలిగేది కాదు," అని ప్రహ్లాదుడు తండ్రికి సమాధానం చెప్పాడు.

ఈ మాట వింటూనే హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి తన తొడ మీది నుంచి కిందికి తోసేసి, తన భటులతో, "వీణ్ణి నా ఎదురుగా లేకుండా తీసుకుపోయి చంపెయ్యండి. తన పినతండ్రిని చంపిన విష్ణువు అడుగులకు మడుగులొత్తే వీడు నా తమ్ముణ్ణి చంపిన వాడి కిందనే లెక్క. అయిదేళ్ళకే తల్లిదండ్రులకు శత్రువైన వీడు ఆ హరి కోసం ఏం చేసినా చెయ్యగలడు! నాకు పుట్టితేనేం గనక? శరీరంలో పుట్టిన రోగాన్ని నాశనం చేసుకోమా? కుళ్ళిపోయిన అంగాన్ని ఖండించమా? విషం యిచ్చిగాని, మరొక విధంగా గాని వీణ్ణి చంపెయ్యండి!" అన్నాడు. (ఇంకా వుంది)






అవి వర్షారంభ దినాలు. సాయంకాల మయింది. విష్ణుపురం నుంచి మంధారణానికి వెళ్ళే మార్గంలో ఒక యువకుడు గుర్రంపైన సవారీ అయి, ఒంటరిగా ప్రయాణిస్తున్నాడు. అతను వెళ్ళే ప్రాంతం ఒక అంతులేని మైదానం. త్వరలో చీకటి పడిపోతుందన్న ఉద్దేశంతో ఆ యువకుడు గుర్రాన్ని మరింత వేగంగా నడిపించాడు.

అతను మైదానాన్ని దాటే సరికి సూర్యుడస్తమించి, మేఘాలు కప్పిన ఆకాశాన్ని చీకట్లు ఆవరించాయి.

త్వరలోనే గుర్రానికి దారి కనిపించకుండా పోయింది. మధ్య మధ్య ఆకాశాన వచ్చే మెరుపుల కాంతిలో అతను దారి చూసుకుంటూ ముందుకు సాగాడు. మరి కొంచెం సేపటికల్లా ఉధృతంగా గాలి వీచింది. దానితోపాటు వాన కూడా సాగింది. యువకుడు తానై గుర్రాన్ని నడపలేక, కళ్ళెం విడిచేసి, గుర్రాన్ని దాని ఇచ్ఛ ప్రకారం పోనిచ్చాడు.

కొంత దూరం ఇలాపోగా గుర్రం కాలికి రాతిగట్టులాటి దేదో తగిలింది. అంతలోనే మెరుపు మెరిసి, యువకుడికి తెల్లని కట్టడం ఏదో కనిపించింది. అతను గుర్రం దిగి చూసే సరికి, గుర్రం కాలికి తగిలినది రాతి మెట్లని తెలిసింది. అతను గుర్రాన్ని అక్కడే వదిలి, ఎక్కడన్నా ఆశ్రయం దొరుకుతుందేమోనని మెట్లెక్కి ముందుకు వెళ్ళాడు.

బంకించంద్ర చట్టోపాధ్యాయ



మళ్ళీ మెరుపు మెరిసి, దాని కాంతిలో అత నికి ఎదురుగా ఉన్న ఆలయమందిరం కని పించింది. అతనికి తెల్లగా కనిపించిన కట్టడం అదే.

మందిరానికి గల చిన్నద్వారం బంధించి ఉన్నది. అతను చేతితో తలుపులు తడివి, ఎవరో వాటిని లోపలి నుంచే గడియపెట్టా రని గ్రహించి, "ఈ నిర్జనారణ్య ప్రదేశంలో ఈ సమయంలో ఎవరు దాక్కొని ఉంటారు?" అని ఆశ్చర్యపడ్డాడు.

వర్షం బలంగా కురుస్తున్నది. అందు చేత అతను మందిరం తలుపు మీద దబ దబా బాదాడు. కాని లోపల ఉన్నవాళ్ళు వచ్చి తలుపు తెరవలేదు. కాలితో తన్ని తలుపులు విరగ్గొడదామన్న ఆలోచన వచ్చింది గాని, అది అపచార మవుతుందను కుని, చేత్తోనే మరింత గట్టిగా బాదాడు. ఆ దెబ్బలకే లోపలి గడియ విరిగి పడి పోయింది, తలుపులు తెరుచుకున్నాయి, యువకుడు లోపల ప్రవేశించాడు. లోపలి నుంచి హీనస్వరంతో అస్పష్టంగా ఒక ధ్వని వచ్చింది. అయితే తలుపులు తెరవగానే గాలి లోపల ప్రవేశించి, మందిరంలో మిణుకు మిణుకు మంటున్న దీపం కాస్తా ఆరిపోవటంతో మందిరం అంధకార మయమై అతనికి ఎవరూ కనిపించలేదు.

అతను మందిరంలోని దేవుడికి నమ స్కారం చేసి, "లోపల ఎవరు?" అని గద్దించి ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు సమా ధానం రాలేదు గాని ఆభరణాలు చేసే కింకిణీస్వనం మాత్రం విన వచ్చింది.

యువకుడు తలుపులను మూసేసి, వాటికి చేర గిలబడి నిలిచి, "లోపల ఉండే వాళ్ళు నే చెప్పే మాట శ్రద్ధగా వినండి. నేను కత్తి చేతబట్టి మందిరద్వారం వద్ద విశ్రాంతి తీసుకుంటున్నాను. లోపల ఉన్నది పురుషుడై ఉండి, నా విశ్రాంతికి భంగం కలిగించాడో అందుకు తగ్గ ఫలితం తప్పక

పొందుతాడు. లోపల ఉన్నది స్త్రీ అయి ఉంటే సుఖంగా విశ్రమించవచ్చు, నా వల్ల ఎలాటి ప్రమాదమూ జరగదు,'' అన్నాడు.

కొంచెం సేపట్లో లోపలి నుంచి ఒక స్త్రీ కంఠం మృదువుగా, "తమ రెవరు ?" అని అడిగింది.

అతను ఆ కంఠానికీ, ప్రశ్నకూ ఆశ్చర్య పడి, "నే నెవరో తెలుసుకున్నందు వల్ల ఏమిటి ప్రయోజనం ?" అన్నాడు.

"మేం చాలా భయంలో ఉన్నాం," అని అదే కంఠం జవా బిచ్చింది.

"నే నొక యువకుణ్ణి. మీ రెవరో తెలుసుకో కుండా నే నెవరో చెప్పటానికి వీల్లేదు. నా వల్ల మీ కెలాటి విఘ్నంగాని, కష్టంగాని కలగదు. ఆ భయం మీ కేమీ అవసరం లేదు," అన్నా డతను.

"మీ మాటలు మాకు ధైర్యాన్నిచ్చాయి. ఇంతకు ముందు ప్రాణా లరచేత పట్టుకుని ఉన్నాం. సంధ్యాసమయాన మేము ఈ శైలేశ్వరాలయంలో శివుణ్ణి పూజించ వచ్చాం. పూజ పూర్తి అవుతూండగానే పెద్దగా గాలివాన వచ్చింది. మా పరివారమూ, వాహనాలూ మమ్మ విడిచి ఎటో పోయాయి. మే మిక్కడ చిక్కుపడిపోయాం," అన్నది స్త్రీ కంఠం.



"విచారించకండి. ఈ రాత్రికి ఇక్కడే విశ్రమించండి. తెల్లవారి మిమ్మల్ని మీ ఇంటికి చేరుస్తాను," అన్నాడు యువకుడు.

"శైలేశ్వరుడు మీకు శుభా లిచ్చు గాక !" అన్నదా స్త్రీ.

అర్ధరాత్రి గడిచినాక గాలివాన నిలిచి పోయింది. యువకుడు లోపల ఉన్న మనుషులతో, తాను సమీప గ్రామానికి వెళ్ళి దీపం తెస్తాననీ, తాను వచ్చేదాకా వారు ధైర్యంగా ఉండాలనీ అన్నాడు. లోగడ అతనితో మాట్లాడిన స్త్రీ, దీపం కోసం ఎంతో దూరం వెళ్ళ నవసరంలేదనీ, ఆలయాన్ని కనిపెట్టుకుని ఉండే మనిషి ఇల్లు దగ్గిర



లోనే ఉన్నదనీ, అరణ్య మధ్యంలో నివసిస్తాడు గనక అతని ఇంట్లో అగ్నిపరికరాలెప్పుడూ ఉంటాయనీ అన్నది.

యువకుడు మందిరంలో నుంచి బయటికి వచ్చాడు. బయట వెన్నెల కాస్తున్నది. ఆ వెన్నెల కాంతిలో మందిరానికి సమీపంలో కాపలా కాసే వాడి కుటీరం కనిపించింది. యువకుడు అక్కడికి వెళ్ళి కాపలావాణ్ణి లేపాడు. కాని వాడు వెంటనే తలుపు తెరవటానికి భయపడ్డాడు; తలుపు సందుల్లో నుంచి యువకుణ్ణి పరీక్షగా చూసి, యువకుడిస్తానన్న బంగారు నాణాల ప్రోత్సాహంతో తలుపు తెరిచి, దీపం వెలిగించాడు.

యువకుడా దీపంతో మందిరానికి తిరిగి వచ్చాడు. మందిరం లోపల పాలరాతితో చేసిన శివలింగం ఉన్నది. దాని వెనుకగా ఇద్దరు స్త్రీ లున్నారు. వారిలో ఒకతె నవయౌవని. ఆమె దీపం చూస్తూనే, మేలి ముసుగుతో సహా తన ముఖాన్ని వంచేసుకున్నది. కాని ఆమె ధరించిన దుస్తులూ, రత్నాలు పొదిగిన శిరోభూషణమూ, ఇతర నగకట్టూ చూస్తే ఆమె గొప్ప వంశానికి చెందినట్టు తెలుస్తూనే ఉన్నది.

రెండవ స్త్రీకి ముప్పైఅయిదు సంవత్సరాలుండవచ్చు. ఆమె ధరించిన దుస్తులు అంత ఘనంగా లేవు. అందుచేత ఆమె మొదటి అమ్మాయికి పరిచారిక అయి ఉంటుందనీ, కేవలమూ పరిచారికలాగా కనబడటం ఇష్టంలేక, అంతకంటె ఉచ్చగా కనిపించ యత్నిస్తున్నదనీ యువకు డనుకున్నాడు. ఒక చిత్ర మేమంటే ఇద్దరూ బెంగాలీ స్త్రీల లాగుండక, వేషభూషణలలో పశ్చిమ దేశానికి చెందిన హిందుస్తానీల లాగున్నారు.

కాంతి అంతటా పడేటట్టుగా దీపాన్ని ఒకచోట ఉంచి, యువకుడు ఆ ఇద్దరు స్త్రీల కెదురుగా నిలబడ్డాడు. దాని వెలుతురులో స్త్రీ లిద్దరూ అతన్ని బాగా చూశారు.

అతని వయస్సు ఇరవైఅయిదు మించదు. మనిషి బాగా ఎత్తుగా ఉన్నాడు, అజాను బాహువు. ఛాతీ విశాలంగా ఉంది, కరచరణాలు బలిష్ఠంగా ఉన్నాయి. మనిషి చూడ ముచ్చటగా ఉన్నాడు. ధగధగలాడే శరీర చ్ఛాయ. లేత చిగురుటాకుల రంగు గల దుస్తులు ధరించి ఉన్నాడు. అతనిలో రాజపుత్ర కళ ఉట్టి పడుతున్నది. అతని నడుముకు ఒరతో సహా కత్తి వేళ్ళాడుతున్నది. ఒక చేతిలో వాడి మొన గల బల్లెం ఉంది. అతని తల మీద తలపాగా, అందులో వజ్రం పొదిగిన తురాయీ ఉన్నాయి. చెవులకు ముత్యాల కర్ణాభరణాలూ, మెడలో రత్నహారమూ ఉన్నాయి.

అతనికీ, ఆ స్త్రీలకూ కూడా పరస్పరం పరిచయం చేసుకోవాలన్న కుతూహలం పుట్టుకొచ్చింది. అతనే ముందుగా తన కుతూహలాన్ని బయటపెట్టుతూ, "మీరు గొప్ప ఇళ్ళకు చెందిన అంతఃపురకాంతలని తెలుస్తూనే ఉన్నది. కాని మిమ్మల్ని గురించి వివరాలడగటానికి కొంచెం జంకుగా ఉన్నది. ఎందుచేతనంటే, నేనెవరో మీకు చెప్పటానికి కొన్ని ఆటంకాలున్నాయి. మీ కలాటి ఆటంకాలు ఉండవు గనక మీ వివరాలు విన గోరుతున్నాను," అన్నాడు.



పరిచారిక లాగా కనిపించే ఆమె, "స్త్రీలు తమను గురించి ఏమి చెప్పుకుంటారు? రహస్యంగా ఉండటమే వారికి పరువు. వారి కొక వృత్తి లేదు. ఎవరి పేరు చెప్పి వారు పరిచయం కలిగిస్తారు? తమ భర్తల పేర్లు కూడా నోట ఉచ్చరించరాదాయె," అన్నది.

యువకుడేమీ మాట్లాడలేదు. అతని మనసు నవయౌవని మీద లగ్నమయింది. ఆమె తన పరిచారిక వెనక నుంచి, కొంచెంగా మేలిముసుగు తొలగించి, తదేక ధ్యానంతో యువకుణ్ణి చూస్తున్నది. అతను కూడా తన దృష్టిని ఒకసారి ఆమె కేసి తిప్పి, మళ్ళీ దాన్ని పక్కకు తిప్పలేక



పోయాడు. అటువంటి అందగత్తెను అతను ఎన్నడూ చూసి ఉండలేదు. వా రిద్దరూ ఒకరినొకరు చూసుకోవటంలో చాలా ఆనందం అనుభవించారు.

తానన్న మాటకు యువకు డేమీ అనక పోవటంతో పరిచారిక తల ఎత్తి చూసి, తన సఖికీ ఆ యువకుడికీ మధ్య చూపు లెలా దృఢంగా బంధాలయాయో గమనించి, ఆ అమ్మాయి చెవిలో, "సాక్షాత్తూ శివుడి సన్నిధినే స్వయంవరమా ఏం?" అన్నది రహస్యంగా.

ఆ అమ్మాయి ఆమెను గట్టిగా గిల్లి, "చాల్లే, ఊరుకో!" అన్నది.

ఈ ప్రణయం ముదరకముందే ఆ యువకుణ్ణి అతని దారిన పంపెయ్యటం మంచి దనీ, లేకపోతే ప్రేమపాశంలో చిక్కుకున్న తన సఖికి బాధ తప్ప ఏమీ ఉండదనీ అనుకుని ఆ స్త్రీ అతనితో, "అయ్యా, గాలివాన మాకు పెద్ద సంకటం తెచ్చి పెట్టింది. అది తగ్గిపోయింది గనక, ఇక మేము మెల్లిగా నడుచుకుంటూ ఇంటికి పోవచ్చు," అన్నది.

"నిజానికి నేనూ నా గమ్యస్థానికి వెళ్ళి పోవాలి. కాని మీ సఖిని రక్షణ లేకుండా వెళ్ళనివ్వటం నా కెంత మాత్రమూ ఇష్టం లేదు. అందుచేత నేను మిమ్మల్ని మీ ఇంటి దాకా దిగబెడతాను," అన్నాడు యువకుడు.

"మీకు మా పైన ఎంత దయ! కాని మీరు మీ పని మీద వెళ్ళిపోవలిసిందని నా ప్రార్థన. కృతజ్ఞత లేక ఈ మాట అంటున్నా ననుకోవదు. స్త్రీలం కావటంచేత మా గురించి అడుగడుగునా అనుమానాలే కలుగుతాయి. మీరు మా వెంట వచ్చి దిగ బెడతారే అనుకోండి. మా ప్రభువుగారు, అంటే ఈ అమ్మాయి తండ్రిగారు, ఈ అప రాత్రివేళ ఎవరి వెంట వచ్చారని అడిగితే, ఈమె ఏమని జవాబు చెబుతుంది?" అన్నది పరిచారిక.





యువకు డొక్క క్షణం ఆలోచించి, "మానసింహ మహారాజు కొడుకైన జగత సింహుడి వెంట వచ్చానని చెబుతుంది," అన్నాడు. అత నా మాట అనే సరికి అ స్త్రీ లిద్దరూ మందిరం పైన పిడుగు పడ్డంతగా కంగారు పడ్డారు. ఇద్దరూ చప్పున లేచి నిల బడ్డారు. పరిచారిక చీర కొంగు కంఠానికి చుట్టుకుని, ఆ యువకుడి కాళ్ళకు వందనం చేసి, చేతులు కట్టుకుని నిలబడి, "యువరాజా, తెలియక అపరాధం చేశాం. మన్నించండి," అన్నది.

జగతసింహుడు చిరునవ్వు నవ్వి, "మీరు చేసిన అపరాధా లేవో క్షమిస్తానుగాని, మీ విషయం చెప్పకపోతే మటుకు తప్పక దండిస్తాను," అన్నాడు.

నవయౌవని రసికత్వంతో కూడిన ధైర్యంతో, చిరునవ్వు నవ్వుతూ, "మీ రే దండన ఇచ్చినా సంతోషంగా స్వీకరి స్తాను," అన్నది.

"మీ వెంట వచ్చి ఇల్లు చేరుస్తాను. అదే దండన," అన్నాడు యువరాజు.

ఇంతలో బయట గుర్రాలడెక్కల చప్పు డయింది. అతను చప్పున మందిరం వెలు పలికి వచ్చి, నూరు గుర్రాలపై రాజపుత్ర యోధులు వస్తూ ఉండటం చూశాడు. వారతని పరివారమే. అతను యుద్ధ సంబంధమైన పని మీద విష్ణుపురానికి వెళ్ళి ఈ పరివారంతో తండ్రి వద్దకు తిరిగివస్తూ, మార్గ మధ్యంలో వారి నుంచి వేరయాడు. వా రిప్పు డతన్ని తిరిగి కలుసుకున్నారు. అతను "ఢిల్లీ చక్రవర్తికి జై!" అని కేక వేయగానే అశ్వికులలో ఒకడు అతని సమీ పానికి వచ్చి, "తమ కోసం తెగ వెతికాం. ఆ మర్రిచెట్టు దగ్గిర మీ గుర్రం కనిపిం చింది," అన్నాడు.

"దగ్గిర గ్రామానికి వెళ్ళి రెండు మేనాలూ బోయీలూ తేవటానికి ఇద్దరిని ఇక్కడ ఉంచి, మిగిలిన వాళ్ళను

ముందుకు సాగమను," అన్నాడు జగత సింహు డా అశ్వికుడితో. యువరాజు రెండు మేనాలు తెమ్మన్నట్టు తెలిసి రాజపుత్ర యోధులలో కొందరాశ్చర్యపడ్డారు, కొందరు హాస్యాలాడారు.

ఈలోపుగా నవయవ్వని పరిచారికతో, "విమలా, నన్ను రాజకుమారుడి కెందుకు పరిచయం చెయ్యలేదు?" అని అడిగింది.

"ఎందుకు చెయ్యలేదో మీ నాన్నగారి ఎదట చెబుతాను," అన్నది విమల.

మేనాల కోసం వెళ్ళిన వారు తిరిగి రాక ముందే ఆ స్త్రీల వాహనాలూ, పరిజనమూ వచ్చారు. వారిని చూసిన జగతసింహుడు మందిరంలోకి వచ్చి, "ఎవరో రక్షక భటులూ, మేనాలూ రావటం చూశాను. బయటికి వచ్చి, వారంతా మీ వారేనేమో చూసుకోండి," అని స్త్రీలతో అన్నాడు. విమల బయటికి వచ్చి చూసి, "ఆ వచ్చేది మా పరివారమే!" అన్నది.

"అయితే నే నిక్కడ ఉండి వాళ్ళంద రికీ కనిపించటం మంచిది కాదు. నేను మీ కిక్కడ కనబడ్డానన్న సంగతి ఒక వారం రోజులపాటు ఎవరికీ చెప్పవద్దు. నా హృదయంలో మీ సఖి రూపు నిలిచిపోయింది గాని ఆమెను గురించి ఏమీ తెలుసుకోలేక పోయాను," అన్నాడు జగతసింహుడు.

"యువరాజా, నే నామెను గురించి చెప్పకపోవటానికి కారణం ఉన్నది. తెలుసుకోవాలన్న కుతూహలం ఇలాగే ఉండే పక్షంలో ఇవాళకు పదిహేనో రోజున మీరు కలుసుకోమన్న చోట వచ్చి కలుసుకుని అంతా చెబుతాను," అన్నది విమల.

అతను కొంచెం ఆలోచించి, "ఆ రోజున ఇక్కడే కలుసుకుందాం. అది జరగని పక్షంలో ఇక మన మెన్నడూ కలుసుకోలేం!" అన్నాడు. అతను నవయౌవని వంక మరొక్కసారి చూసి, గుర్రాన్నెక్కి వెళ్ళి పోయాడు. —(ఇంకావుంది)





# అదృష్టహీనుడు

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు ఏ మహాపరాధం చేసిన కారణం చేత ఈ నిశిరాత్రివేళ ఇలా శ్రమిస్తున్నావో నాకు తెలియదు. కాని ప్రపంచంలో కొందరు అదృష్టహీనులు ఏ తప్పూ చెయ్యకుండానే క్రూరమైన శిక్షలు అనుభవిస్తారు. ఇందుకు తార్కాణంగా సాకేతుడనే వాడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్ప సాగాడు:

ఉశీనరదేశంలో సాకేతు డనేవాడు కసాయిగా జీవించే వాడు. వాడి వద్ద మేలైన గొర్రెమాంసం దొరికేది. అందుచేత చుట్టుపట్ల చాలా దూరం నుంచి కూడా మనుషులు వచ్చి వాడి వద్ద మాంసం కొనుక్కుపోయే వారు. వాడు గొర్రెల పెంపకంలో

## బేతాళ కథలు



కూడా నిపుణుడు కావటం చేత వాడికి మంచి పేరూ, డబ్బూ కూడా లభించాయి.

ఇట్లా ఉండగా ఒకనా డొక ముసలివాడు సాకేతుడి వద్ద మాంసం కొని సరి కొత్త వెండి నాణెం ఇచ్చి వెళ్ళాడు. సాకేతుడా నాణెం చూసి ముచ్చటపడి దాన్ని వేరే ఒక సంచీలో వేశాడు. అది మొదలు ప్రతి రోజూ ఆ ముసలివాడు ఒక కొత్త వెండి నాణెం ఇచ్చి సాకేతుడి వద్ద మాంసం కొనుక్కు పోతూ వచ్చాడు.

కొంతకాలం గడిచింది.

సాకేతుడి వద్ద ధనికులు ఏటా పందెపు పొటేళ్ళను కొనటం అలవాటు. సంక్రాంతి పండుగ ఇంకా కొద్ది మాసాలున్న దనగా సాకేతుడు గ్రామాల వెంట తిరిగి, మంచి పొటేళ్ళను ఏరి కొనుక్కొచ్చి, వాటికి తగిన తిండి పెట్టి, పందాలకు తయారు చేసి వాటిని మంచి ధర ఇచ్చిన వారికి అమ్ముతుండే వాడు.

ఈసారి అతనికి పొటేళ్ళ బేరం మీద బయలుదేరా లనిపించి, తాను ప్రత్యేకంగా దాచి ఉంచిన నాణాలు ఎంచుదామని సంచీ తీశాడు. అందులో చెయ్యిపెట్టి అతను గుప్పెడు నాణాలు పైకి తీశాడు. కాని అతని గుప్పిట్లోకి వచ్చినవి నాణాలు కావు—చిల్ల పెంకులు! కంగారు పడి అతను సంచీని బోర్లించాడు.

సంచీ నిండా చిల్లపెంకులే తప్ప ఒక్క వెండి నాణెం లేదు!

ముసలివాడు తనను మోసం చేశా డను కుని ఆగ్రహంతో సాకేతుడు పళ్ళు పటపటా కొరుకుతూ, "వాణ్ణి ఈ సారి కనబడనీ కండకు కండ చీల్చేస్తాను!" అంటూంటే, మాంసం కొన వచ్చినవారు, "ఏం జరిగింది? ఎవరు నిన్ను మోసం చేశారు?" అని అడిగారు.

ఇంతలో ముసలివాడే మాంసం కొనటానికి వస్తూ కనిపించాడు. సాకేతుడు తన

దుకాణం నుంచి బయిటికి దూకి, ముసలి వాడికి ఎదురు పరుగెత్తుకుంటూ వెళ్ళి, వాడి మెడ పట్టుకుని, "దుర్మార్గుడా! వంచకుడా! నన్ను మోసం చేస్తావా?" అని అరిచాడు, అందరినీ కేకవేశాడు.

ముసలివాడు రహస్యంగా, "నోరు మూసుకో! నా మీద నింద వేశావంటే నిన్ను సర్వనాశనం చెయ్యగలను!" అన్నాడు.

సాకేతు డావేశంతో, ముసలివాడి మాటలు లక్ష్య పెట్టక, "నన్ను ఏం చెయ్యగలవు రా, మాయదారి వాడా?" అని మరింత గట్టిగా అరిచాడు.

ముసలివాడు గొంతెత్తి అందరికీ విని పించేలాగా, "నీ రహశ్యం నాకు తెలిసి పోయింది. అందరికీ చెప్పక మానుతాననుకుంటున్నావా?...అయ్యా, చూడండి! ఈ నిర్భాగ్యుడు మనందరినీ మభ్యపెట్టి గొర్రె మాంసమని చెప్పి శవాల మాంసం ఇస్తున్నాడు. ఈ క్షణానే వీడి ఇంట మనిషి శవం ఉన్నది!" అన్నాడు.

"అబద్ధం! పచ్చి అబద్ధం! నీ మాట రుజువు చెయ్యి!" అన్నాడు సాకేతుడు.

"రుజువు చెయ్యక ఊరుకుంటానా? నీ రహస్యం పది మందికీ తెలియవద్దా? పద, నీ యింటికి నడు!" అంటూ ముసలి




వాడు, పది మందినీ వెంటబెట్టుకుని సాకే తుడి ఇంటికి బయలుదేరాడు. వాడి ఇంటి వెనుక గదిలో గోడకు చేరబెట్టి ఒక మనిషి కళేబరం ఉన్నది.

ముసలివాడు శక్తి గల మాంత్రికుడు. ఆ సంగతి ఎవరికీ తెలియదు.

దాన్ని చూడగానే సాకేతుడు కేవలమూ ఆశ్చర్యపోయాడే గాని, మిగిలిన వాళ్ళంతా ఆగ్రహావేశం చెందారు. అందరూ అతని పైన పడి చావ చితకపొడిచారు. సాకేతుడు స్పృహ తప్పి పడిపోయాక, అతని దుకాణంలో ఉన్న మాంసమంతా మట్టిలో తొక్కేశారు. ఆ దొమ్మిలో సాకేతుడికి ప్రాణం

పోలేదన్నమాటే గాని, ఎడమ కన్ను కాస్తా పోయింది. అతను స్పృహ తెలిసి లేచే టప్పటికి చుట్టుపక్కల ఎవరూ లేరు. అతని కుండిన ఇల్లూ, డబ్బూ, సమస్తమూ పోయింది.

ఇక ఆ దేశంలో తాను బతకలేనని తెలుసుకుని సాకేతుడు మరొక దేశం వెళ్ళి అక్కడ చెప్పులు కుట్టే పని చేసుకుంటూ ఏదో విధంగా కాలక్షేపం చెయ్యసాగాడు. అభ్యాసం అంతగా లేకపోయినా, కులవిద్యే గనక అతను కాస్త మంచి పేరు తెచ్చుకుని, పైకి వస్తుండగా మరొక దుర్ఘటన జరిగింది.

ఒకనాడు సాకేతుడు తన దుకాణంలో కూచుని చెప్పులు కుట్టుకుంటూ ఉండగా బాకాలూదిన చప్పుడూ, గుర్రపు డెక్కల చప్పుడూ వినపడింది. అదేమిటో వింత చూద్దామని సాకేతుడు దుకాణం బయటికి వచ్చే సరికి, ఆ దేశపు రాజు సపరివారంగా వేటకు బయలుదేరి అటుగా వస్తూ కనిపించాడు.

ఆ రాజు సాకేతుణ్ణి చూస్తూనే కళ్ళకు చెయ్యి అడ్డం పెట్టుకుని, "ఆ ఒంటి కంటి వెధవను నూరు కొరడాదెబ్బలు కొట్టి దేశ బహిష్కారం చెయ్యండి," అని చెప్పి, వేట ప్రయత్నం మానేసి, గుర్రాన్ని తిప్పుకుని



తన నగరుకు తిరిగి వెళ్ళిపోయాడు. వెంటనే రాజభటులు సాకేతుణ్ణి పట్టుకుని వీపు మీదా కాళ్ళ మీదా కొరడాలతో కొట్టి, "దేశం విడిచి పో! లేకపోతే నీకు మరణ దండన పడుతుంది!" అన్నారు.

"ఇంతకూ నేను చేసిన మహాపచార మేమిటి?" అని సాకేతుడు రాజభటుల నడిగాడు.

"ఒంటి కంటివాడు కనిపించటం మా రాజుగారు పెద్ద దుశ్శకునంగా భావి స్తారు. అందులోనూ ఎడమ కన్ను గుడ్డిదైతే ఆయన అసలే సహించరు!" అని రాజ భటులు సాకేతుడికి చెప్పారు.

రాజాజ్ఞ ప్రకారం సాకేతుడా దేశం విడిచి పెట్టి మరొక దేశం వెళ్ళి, అక్కడ ఒక మారు మూల ఇల్లు చూసుకుని నివసించ సాగాడు. అతను ఇల్లు కదిలి ఎక్కడికీ వెళ్ళేవాడు కాడు, తల ఎత్తి ఎవరినీ చూసే వాడు కాడు. ప్రపంచం మొహం చూడ కుండా ఇట్లా కొన్నాళ్ళు గడిపినాక అతనికి ఊపిరాడనట్టయింది. కాస్త పది మంది మధ్యకూ వెళ్ళి, స్వేచ్ఛగా గాలి పీల్చి, ప్రపంచం కేసి ఒకసారి చూడాలన్న తహ తహ అతనిలో పెరగసాగింది.

అందుచేత ఒక రాత్రి సాకేతుడు తల మీదుగా ఒక దుప్పటి కప్పుకుని, వీధుల





వెంట బయలుదేరాడు. అతను కొంత దూరం వెళ్ళాక వెనక నుంచి గుర్రపు డెక్కల చప్పుడు వినిపించింది. ఆ చప్పుడు వినగానే అతనికి మతిపోయినట్టయింది. ఏ రాజభటులో వెంట తరుముకొస్తున్నట్టుగా అతను కాలి బలంకొద్దీ పరిగెత్తుతూ సందుల వెంటా, గొందుల వెంటా పడిపోయి, ఒక ఇంటి వాకిలి తలుపు తోశాడు. తలుపు తెరుచుకున్నది. లోపల అంధకారపూరితమైన గొంది కనిపించింది. ఒక ఘడియసేపు ఆ చీకట్లో దాగి ఉండి తరువాత నిమ్మళంగా ఇంటికి చేరుకుందా మనుకున్నాడు సాకేతుడు.

కాని అతను చీకటిలోకి ప్రవేశించి పక్క గోడను ఒదిగి నిలబడిన మరుక్షణంలో ఇద్దరు మనుషులు అతని పైన పడి, "దొరికావా, దుర్మార్గుడా? ఎంతకాలం తప్పించుకు తిరుగుదామనుకున్నావు?" అంటూ అతన్ని పట్టి బంధించారు.

సాకేతుడు సగం చచ్చి, "బాబూల్లారా, నేను మీకే మపకారం చేశాను? నన్నెందుకిట్లా పట్టుకున్నారు?" అని అడిగాడు.

"మూడు రోజుల నుంచీ నువ్వు మా యజమానిని చంపే ప్రయత్నంలో కత్తి పట్టుకుని ఆయనను వెంబడిస్తూ, పట్టుకోవటానికి ప్రయత్నించినప్పుడల్లా తప్పించుకు పారిపోవటం లేదా? అమాయకుడిలా నటించకు," అన్నా రా మనుషులు.

"మీ రెవరో, మీ యుజమాని ఎవరో కూడా నాకు తెలియదే?" అన్నాడు సాకేతుడు.

"నీ అబద్ధాలు నమ్మటానికి మేమేం వెర్రివాళ్ళ మనుకున్నావా? మా యజమానిని హత్య చెయ్యటానికి కాకపోతే ఈ యింటి సందులోకి వచ్చి ఎందుకు దాక్కున్నావు? నీ దగ్గిర కత్తి లేదూ?" అంటూ ఆ ఇంటి నౌకర్లు సాకేతుణ్ణి వెతకగా అతను తోలు కోసుకునే ఉలి దొరికింది.

దానితో వాళ్ళ అనుమానం రూఢి అయింది. వాళ్ళు సాకేతుణ్ణి న్యాయాధి కారి వద్దకు తీసుకుపోయారు. న్యాయాధి కారి సాకేతుణ్ణి పరీక్ష చేయించగా అతను అదివరకే కొరడాదెబ్బల శిక్ష పొందినవాడని తెలిసిపోయింది. అందుచేత ఆటే విచా రించవలిసిన పని కూడా లేకుండా, "వీడు పాత నేరస్తుడే. నూరు కొరడాదెబ్బలు కొట్టి, దేశబహిష్కారం చెయ్యటమే వీడికి శిక్ష!" అన్నాడు న్యాయాధికారి.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నిర్దోషి అయిన సాకేతుడు నిక్షేపంలాటి తన వృత్తిని పోగొట్టుకుని, ఎక్కడా తల ఎత్తుకు తిరగ టానికి లేని స్థితిలో పడి, ప్రపంచాని కంతకూ శత్రువై, పనికిమాలినవాడై అకార ణంగా ఒక శిక్ష తరువాత మరొక శిక్ష అను భవించటాని కేమిటి కారణం? ఈ నా సందే హానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సాకేతుడికి ఈ కష్టాలు అకారణంగా రాలేదు. అతను బలవద్విరోధం తెచ్చిపెట్టుకున్నాడు. అతను మాంత్రికుడితో విరోధం పెట్టుకున్న క్షణం నుంచీ అతని కష్టాలు ఆరంభమయాయి. చిల్లపెంకులను వెండి నాణాలుగా కనపడే లాగా చేయగల శక్తి ఉన్నవాడని తెలిసి నప్పుడు, మాంత్రికుడు చేసిన మోసానికి ప్రతి క్రియ ఎట్లా చేయాలో ఆలోచించి ఉండవలసింది; సాకేతుడు అలా చేయక, తొందరపడి ఆ మాంత్రికుడిపై చెయ్యి చేసు కున్నాడు. ఒకసారి భ్రష్టుడైనవాడికి వికాసం ఉండదు. స్థానబలం లేని సాకేతుడికి ప్రతి చిన్న సంకటమూ పెద్ద ఆపదగా పరిణ మించింది. స్థానబలం ఉన్నవాడైతే అతను శిక్షలు పడి ఉండకపోను," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# ఇంద్రుడి భార్య

త్వష్ట ప్రజాపతి విశ్వరూపు డనే వాణ్ణి సృష్టించగా, ఇంద్రుడు మొదలుగా గల దేవతలు అతన్ని తమ గురువుగా పెట్టు కున్నారు. దానవులు కూడా విశ్వరూపుణ్ణి పూజిస్తూనే ఉండేవారు. అతను దేవతలు తన కిచ్చిన యజ్ఞభాగాలను దానవుల కిస్తూ ఉండే వాడు. అది చూసి సహించ లేక ఇంద్రుడు విశ్వరూపుణ్ణి చంపేశాడు.

అందుకు త్వష్ట ఇంద్రుడి పైన అలిగి, ఇంద్రుణ్ణి చంపటానికి గాను హోమగుండం నుంచి వృత్రాసురుణ్ణి సృష్టించాడు. వృత్రుడు బ్రహ్మను ప్రార్థించి గొప్ప వరాలు పొందాడు. తరువాత ఇంద్రుడు వృత్రుడితో యుద్ధం చేసి ఓడి పారిపోయాడు. "వృత్రుణ్ణి ఎప్పటికైనా ఉపాయంతో చంపవచ్చు. ప్రస్తుతం అతనితో విరోధం పెట్టుకోక సఖ్యంగా ఉండు," అని విష్ణువు ఇంద్రుడికి సలహా ఇచ్చాడు. మునులు ఇంద్రుడికీ వృత్రుడికీ స్నేహం చేశారు. అనంతరం వృత్రుడు శక్తిహీనుడై ఉన్న సమయంలో ఇంద్రుడు వజ్రాయుధంతో అతన్ని కొట్టాడు.

వృత్రాసురుడు చచ్చిన అనంతరం ఇంద్రుడు తన కన్న శక్తిమంతుడు పధ్నా లుగు లోకాలలోనూ లేడనీ, బ్రహ్మ చేత వరాలు పొందిన వాడు తన చేత చచ్చాడు గనక తాను బ్రహ్మ కంటె కూడా ఎక్కువే ననీ అనుకున్నాడు.

అందుచేత ఇంద్రుడు దేవతల నందరినీ సమావేశ పరిచి, "ఇకనుంచీ నేనే మీ కంద రికీ అధిపతిని. మీ అందరి యజ్ఞభాగాలూ నాకే చెందాలి. వాటిని ఒక పాత్రలో వేసి ఉంచి, నేను తీసుకోగా మిగిలినది మీరు పంచుకోవాలి. ఇక నుంచీ నేను బ్రహ్మ లోకంలో ఉంటాను," అని చెప్పాడు.

దేవతలు ఒకరి ముఖా లొకరు చూసు కున్నారు. ఇంద్రుడికి ఎదురు చెప్పవద్దని

బృహస్పతి వారికి సైగ చేశాడు. దేవతలందరూ తన ఆజ్ఞను శిరసావహించినట్టే భావించి, తృప్తిపడి, ఇంద్రుడు బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు.

ఇంద్రుడు బ్రహ్మ వద్దకు వెళ్ళి, నమస్కారమైనా చెయ్యకుండా, "ఓయీ, జడబ్రహ్మ! నీ మూలాన వృత్రాసురుడు బలవంతుడై లోకాలన్నిటినీ భయపెట్టాడు. చివరకు నేను వాణ్ణి చంపి అందరి కష్టాలూ నివర్తింప జెయ్యవలసి వచ్చింది. నీలాటి వాళ్ళంతా ఎందుకూ పనికిరాలేదు. నీ పదవి నా పరం చేసి నీ విక వెళ్ళిపో. నా ప్రతాపాన్ని గుర్తించిన గౌరవమైనా దక్కుతుంది," అన్నాడు.

"నీ ప్రతాపాన్ని గౌరవించటాని కేమీ అభ్యంతరం లేదు గాని, నా స్థానాన్ని వదిలి పెట్టి పోవటానికి నే నెవణ్ణి? అందరూ ఏమంటారు?" అన్నాడు బ్రహ్మ.

"నీ వెవరివో నీకే తెలీ దన్నమాట! అలాటి వాడివి ఎక్కడ ఉంటేనేం? నిన్ను గురించి ఎవరేమనుకుంటేనేం? ఇక నుంచీ లోకాలన్నిటికీ అధిపతి దేవేంద్రుడే!" అంటూ ఇంద్రుడు బయలుదేరి బ్రహ్మలోకం చుట్టి ఉన్న ఒక అద్భుత ఉద్యానం ప్రవేశించాడు.



ఆ ఉద్యానంలోని ఒక చెట్టు కింద ఇంద్రుడి కొక అద్భుత సుందరి కనపడింది. నీ వెవరివి, అని ఇంద్రు డడిగితే ఆమె, బ్రహ్మదేవుడి కుమార్తె నన్నది.

"నే నెవరినో తెలుసునా? చాలా గొప్ప వాణ్ణి. త్రిమూర్తులనే అడలగొట్టిన వృత్రాసురుణ్ణి చంపి దేవతల భయం పోగొట్టిన వాణ్ణి. నీ తండ్రి ఈ లోకాన్ని నాకే అర్పణ చేశాడు. అందుచేత నన్ను పెళ్ళాడు. నా వంటి వాడు నీకు మరొకడు దొరకడు," అన్నాడు ఇంద్రు డామెతో.

ఆమె ఒక పత్రం మీద ఏదో రాసి, మడిచి, అతని చేతి కిచ్చి, "నేను రెండు మాట



లడుగుతాను. ముందు వాటికి సమాధానం చెప్పి, ఆ తరవాత ఆ పత్రం విప్పి చదువుకో!" అన్నది.

ఇంద్రుడు కుతూహలపడి, "ఏమడుగుతావో అడుగు," అన్నాడు.

"నా లాటి మనిషిని మరొకతెను నీవు సృష్టించగలవా?" అని ఆమె అడిగింది.

"మన మిద్దరమూ వివాహం చేసుకుంటే నీ లాటి కుమార్తె కలగకూడదా?" అన్నాడు ఇంద్రుడు.

"అది నీ ఒక్కడి సృష్టి కాదే! పోనీ, నీవు వృత్రాసురుణ్ణి మళ్ళీ సృష్టించగలవా?" అని ఆమె అడిగింది.

"ఛీ, ఛీ! అలాటి వాణ్ణెందుకు సృష్టించటం?" అన్నాడు ఇంద్రుడు.

"పోనీ, ఆ వృత్రాసురుణ్ణి మళ్ళీ సంహరించగలవా?" అని అడిగిం దామె.

"నాతో వేళాకోళ మాడుతున్నావా? నే నెవ రనుకున్నావు?" అని ఇంద్రుడు కోపం తెచ్చుకున్నాడు.

"వేళాకోళ మాడటం లేదు. వృత్రాసురు డిక్కడే ఉన్నాడు. వృత్రా, ఇలా ఒకసారి రా!" అని ఆమె కేక పెట్టింది. వృత్రాసురుడు పర్వతాకారంతో వచ్చి నిలబడ్డాడు.

ఇంద్రుడు వజ్రాయుధ మెత్తి వృత్రాసురుణ్ణి గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బ వృత్రుడికి తగలనేలేదు. వాడు నవ్వాడు. ఇంద్రుడు చిన్నబుచ్చుకుని ఆమె కేసి చూశాడు.

ఆమె ఇంద్రుడి దుస్థితి చూసి నవ్వుతూ, "ఇతన్ని నువ్విక చంపలేవు. నీ చేత చచ్చి ముక్తిపొంది ఇత నీ లోకానికి వచ్చాడు," అని వృత్రుణ్ణి పంపేసి, "ఇలాటి వాణ్ణి సృష్టించగలవా?" అని అడిగింది.

"నీవు నన్ను అవమాన పరుస్తున్నావు," అన్నా డింద్రు డామెతో.

"అదేమీ లేదు. నన్ను పెళ్ళాడగోరావు గనక ఈ మాట లడిగాను. పత్రం విప్పి నేను రాసినది చదువుకో!" అన్న దామె.

ఇంద్రుడు పత్రం విప్పి ఇలా చదివాడు:
"నా తండ్రి కన్న శక్తి గల వాణ్ణి భర్తగా స్వీకరించను."

"అందుకే నిన్ను పరీక్షించాను. బ్రహ్మ నన్ను సంకల్ప మాత్రం చేత సృష్టించాడు. వృత్రాసురుడికి గల శక్తి కూడా ఆయన ఇచ్చినదే. ఆయన అలాటి వాళ్ళ నెందరి నైనా సృష్టించగలడు. నీవు బ్రహ్మ కన్న గొప్పవాణ్ణన్నావు గనక అది నిజమో కాదో తెలుసుకోవలసి వచ్చింది. అదృష్టవశాన నీవు బ్రహ్మ కన్న గొప్పవాడివీ, శక్తిమంతుడివీ కావు. అందుచేత నేను నిన్ను పెళ్ళాడగలను," అన్న దామె.

ఆమె ఇంద్రుణ్ణి వెంట బెట్టుకుని బ్రహ్మ వద్దకు వెళ్ళింది. ఇంద్రుడు బ్రహ్మకు నమస్కరించి, తల వంచుకుని నిలబడ్డాడు. బ్రహ్మ వారిద్దరికీ వివాహం చేసి దీవించి పంపాడు.

ఇంద్రుడు తన భార్యతో స్వర్గ లోకానికి తిరిగి వెళ్ళి, దేవతలతో సభ చేసి, యజ్ఞ భాగాలుంచే మహా పాత్రను తెమ్మన్నాడు. దేవతలు మహా పాత్రను తెచ్చి ఇంద్రుడి ముందుంచారు.

బృహస్పతి ఇంద్రుడితో, "మహేంద్రా, నిన్ను మే మందరమూ ప్రభువుగా ఆమోదించాం గనక, నీ ఆజ్ఞలేక యజ్ఞ భాగాలను



తీసుకోక ఈ పాత్రలో నే ఉంచాం. అవి లేక మా బలం తరిగి పోతున్నది. కనక మా మా యజ్ఞ భాగాలు మా కిప్పించు," అని కోరాడు.

ఇంద్రుడు వెటకారంగా నవ్వి, "ముందీ పాత్రను నా అంతఃపురంలో పెట్టించండి!" అన్నాడు. దేవ పరిచారికలు ఆ ప్రాతను ఇంద్రుడి అంతఃపురానికి చేర్చారు.

ఇంద్రుడు తన భార్యతో సహా అంతః పురానికి పోయి, "చూశావా నా వైభవం? ఎంత శ్రేష్ఠమైన హవిర్భాగాలీ పాత్రలో ఉన్నాయో చూడు. వీటిలో నీ కిష్టమైన దంతా నీవు ఆరగించి, మిగిలినది నాకు ఉంచు," అన్నాడు.

"ఈ హవిస్సులు అందరి దేవతల కోసమూ సమర్పించినవి కదా, వీటిని మనిద్దరమే ఆరగించేస్తే మిగిలిన దేవతలు తమ తమ కార్యాలను ఎలా నెరవేర్చు తారు?" అన్నది ఇంద్రుడి భార్య.

"నేను అజ్ఞాపిస్తే వాళ్ళు కార్యాలను నెరవేర్చక ఏం చేస్తారు?" అన్నాడు ఇంద్రుడు.

"ఇదంతా నేనే ఆరగిస్తే అన్ని పనులూ నేనే చెయ్యవలిసి ఉంటుందా?" అని ఆమె అడిగింది.

"అదంతా ఏమీ లేదు. ఈ హవిస్సుల పైన నీకు పూర్తి హక్కు లిచ్చేశాను. సుఖ పడటమే నీ వంతు," అన్నాడు ఇంద్రుడు.

ఇంద్రుడి భార్య ఈ మాట వినగానే దేవతలందరినీ పిలిపించి, "ఈ పాత్రలో ఉన్న మీ మీ హవిర్భాగాలు మీరు తీసు కోండి," అన్నది. ఇంద్రుడు కాదనలేక పోయాడు. ఇంద్రుడి భార్య ధర్మమా అంటూ, దేవతలు హవిర్భాగాలన్నీ ఇంద్రు డికి సమర్పించకుండా, ఎవరివి వారు తీసు కునే పాత పద్ధతి మళ్ళీ అమలు జరిగింది. అందుచేత దేవతలు ఇంద్రుడి భార్యకు ప్రత్యేకంగా హవిర్భాగం ఏర్పాటు చేశారు.






# సందేహాలు

పూర్వం, వింధ్యారణ్య ప్రాంతాలలో ఒక మునీశ్వరుడు దైవధ్యానం చేసుకుంటూ ఉండే వాడు. గుహలో సాధువు ఉండటం లోకానికి క్రమంగా తెలిసింది. అప్పటి నుంచీ జనం గుంపులు గుంపులుగా కొండ మీదికి రావటం ప్రారంభించారు. వాళ్ళ వాళ్ళ మంచి చెడ్డలూ, కష్ట సుఖాలూ చెప్పుకుంటే వాళ్ళ మనసులో బాధ తగ్గేది. సాధువు చెప్పే మంచి మంచి సలహాలు వినగానే దిగులుతో వచ్చిన వాళ్ళు సంతోషంతో మళ్ళి పొయ్యేవాళ్ళు.

ఇలా లోకంలో బాధలన్నీ వినగా వినగా, సాధువు మనస్సులో సందేహాలు ఎక్కువ కాజొచ్చాయి. "నేను చదివి నేర్చిన శాస్త్రాలు వేరు, జనవాక్యం వేరు. ఒకదాని కొకటి సంబంధమే కనబడదు. ధర్మం నశిస్తూంది, అధర్మమే జయిస్తూంది. దేవుడూ దయ్యమూ స్వర్గం-నరకం-ఇవన్నీ వట్టి బూటకాలు. కనుక స్వయంగా పోయి లోకంలో నిజా నిజాలు తెలుసుకుంటే గాని మనశ్శాంతి లేదు" అని అనుకుని, మళ్ళీ ఒకసారి లోకం చూచి రావటానికని గుహ నుండి బయలుదేరాడు.

జీవిత మంటే పూర్తిగా వైరాగ్యం కలిగి పోయిన సాధువు దండమూ, కమండలువూ చేత పుచ్చుకుని కొంత దూరం సాగేసరికి ముద్దులు మూటగట్టే పన్నెండేళ్ళ బాలుడు ఎదురయ్యాడు. సాధువూ బాలుడూ కుశల ప్రశ్నలు వేసుకున్నాక, ఇద్దరూ ఒకే చోటికి వెళుతున్నట్టు తేలింది.

తనకు తలవని తలంపుగా ఇటువంటి సావాసం దొరికినందుకు సాధువు చాలా సంతోషించాడు.

ఉభయులూ కలిసి పోగాపోగా, ఒక ఊరి పొలిమేరని కొందరు సేవకులు వారికి ఘనమైన స్వాగత మిచ్చి, ఒక దివ్య

ఎం. విశ్వేశ్వరరావు



భవనానికి తీసుకపోయారు. ఆ యింటివారు వీరికి గొప్ప విందు చేశారు. బాలుణ్ణి చూచి ముచ్చటపడిన యజమాని తనకు ప్రత్యేకం బహుమతిగా వచ్చిన ఒక బంగారు గిన్నెను బయటికి తీయించి, అందులో పిల్లవాడికి పాయసం వడ్డింపించాడు.

ఆ రాత్రికి అక్కడే అలసట తీర్చుకుని, ఉదయానే యజమాని వద్ద సెలవు తీసుకుని అతిథులు మళ్ళీ బయలుదేరారు. వారు ఇవతలికి వచ్చేయగానే ఆ దివ్య భవనంలో కలవరం బయలుదేరింది—యజమానికి అత్యంత ప్రియమైన బంగారు గిన్నె కనిపించలేదు!

గిన్నె కాజేసింది మరెవరో కాదు, అందరూ అనుమానించినట్టు బాలుడే! భోజనాల సందడిలో అతడు గిన్నె తీసి దాచివెయ్యడం సాధువు గమనిస్తూనే వున్నాడు. తిన్న యింటి వాసాలే లెక్క పెట్టిన బాలుడి తుంటరిబుద్ధికి సాధువు మనస్సులో బాధపడ్డాడు. కాని, "ఏమిట్రా అబ్బాయీ, ఈ పని?" అని ఎదటపడి మందలించలేక పోయ్యాడు.

సాధువూ బాలుడూ సాగిపోతుండగా, ఆకస్మికంగా దారిలో కారు మబ్బుపట్టి కుండపోతగా వర్షం కురిసింది. ఇద్దరూ పూర్తిగా తడిసిపోయారు. అల్లంత దూరంలో మినుకు మినుకుమని ఒక చిన్న వెలుగు కనిపించగా, ఉభయులూ మెల్లగా అక్కడికి చేరుకున్నారు.

"ఎవరయ్యా, ధర్మాత్ములు! తడిసి పోయ్యాం. కాస్త పంచకింద నించుంటాం, రెండు ప్రాణుల్ని రక్షించి పుణ్యం కట్టు కోండయ్యా బాబూ!" అంటూ బతిమ లాడుతూ తలుపులు బాదారు.

కొంతసేపటికి విసుక్కుంటూ నవుకరు తలుపు తెరిచి, ఇద్దర్నీ యజమాని ఎదట పెట్టాడు. "అర్ధరాత్రి వేళ ధర్మ మేమిటి, ఇలాంటివాళ్ళని తీసుకువస్తావే నీకు బుద్ధి

లేదా ?" అని నవుకరును చివాట్లు వేశాడు పరమ లోభి అయిన ఆ యజమాని. చివరి కెలా అయితేనేం, వాకిట్లో పారేసిన అంట్ల గిన్నెలు గీక్కు తినటానికి యజమాని అనుజ్ఞ ఇచ్చి, "వాన కాస్త వెలియగానే వాళ్ళని అవతలికి పంపించెయి, నమ్మరాని కాలం" అంటూ తన నవుకరును హెచ్చరించాడు.

అలానే, బాలుడు అంట్ల పాత్రల్లో అడుగున ఉన్న మెతుకులు సాధువుకు పెట్టి, తను వస్తున్నాడు. కొంత సేపటికి వాన తెరపిచ్చింది.

నవుకరు చెప్పకుండా అతిథులే వెళతా మని అతనితో అని, మళ్ళీ ప్రయాణం సాగించ బోయారు.

గుమ్మం దాటే ముందు బాలుడు తను దొంగిలించి తెచ్చిన ఆ బంగారపు గిన్నెను నవుకరు చేతిలో పెట్టి, "నాయనా!—వేళ గాని వేళ మాకు చోటిచ్చావు. ప్రాణాలు నిలబెట్టావు, పైగా మీ యజమానితో చెప్పి భోజనం కూడా పెట్టించావు. మీరు చేసిన ఆదరణకు ఎన్ని జన్మ లెత్తినా రుణం తీర్చుకో లేమన్న మాట. మీవంటి ధర్మా త్ములూ దయామయులూ అక్కడక్కడ ఉండబట్టే ప్రపంచ మింకా ఇట్లా నిలబడి



వుంది. ఇదుగో, ఏదో ఉడతాభక్తి! ఈ గిన్నెను తీసుకుపోయి, మీ యజమాని కివ్వు" అని చెప్పాడు.

బాలుడు చేసిన పని సాధువుకు విడ్డూర మనిపించింది. పట్టరాని కోపం వచ్చింది. గట్టిగా బుద్ధి చెప్పాలనుకున్నాడు. కాని, నోరు తెరిచి పలకలేకపోయాడు.

బాలుడు "తాతా!–నీ కిదంతా మాయగా కనిపిస్తూంది కాదూ? ఇది మాయ నాటకమే, అందులో మనిద్దరమూ రెండు బొమ్మలం!" అంటూ నవ్వాడు.

"నువ్వేదో మంచి పిల్లవాడి వనుకు న్నాను. నీ సావాసం వల్ల నాకు కలిగిన

సందేహాలు తీరతా యనుకున్నాను..." అంటూ సాధువు ఏదో బాధ అతడికి వెల్లడించబోయాడు.

అప్పుడు బాలుడు, "నీ సందేహాలు తీర్చటానికే వచ్చాను" అంటూ, ఇలా చెప్పాడు: "అయితే విను—మనల్ని గొప్పగా ఆదరించి ఆతిథ్య మిచ్చిన యజమాని ఉన్నాడే, కీర్తి కోసం పటాటోపం చేసి, అప్పులపాలై, ఇల్లు గుల్ల చేసుకుంటున్నాడు. ఆయనకు ప్రాణప్రదమైన స్వర్ణ పాత్ర కాస్తా కాజెయ్యటంతో కన్ను తెరిచి, ఇప్పుడు తగినట్టుగా మసులుకుంటున్నాడు. ఈ విధంగా అతడి పండువంటి కాపరం పాడుకాకుండా చేశాను."

"బాగానే వుంది. మరైతే, అటువంటి పాత్రను పరమలోభి కివ్వడం అపాత్రదానం కాదూ?" అన్నాడు సాధువు.

అందుకు బాలుడు "అదే పొరపాటు. ఆ యజమానికి డబ్బు గడించటమే తెలుసు కాని, ఒకరికి ఇవ్వడమనేది తెలియదు. మన మిచ్చిన బంగారు గిన్నె వెళ్ళి వాని మనస్సు మార్చివేసింది. 'నాలుగు ఎంగిలి మెతుకులు పెట్టినందుకే నా కిటువంటి బహుమతి దొరికిందే, కడుపునిండా భోజనం పెట్టితే ఇంకా ఎంత ఘనమైన బహుమానం దొరికి వుండేదో కదా!' అనుకున్నాడు. పుణ్య కార్యాల మీద ఆసక్తి కలిగింది. ఇప్పుడు విరివిగా దానధర్మాలు చేయడంవల్ల ఆతడు కూడబెట్టిన ఆస్తి అంతా లోకం మంచికోసం వినియోగ మవుతూంది," అని చెప్పాడు.

"నా సందేహాలన్నీ పూర్తిగా తీరిపోయాయి. ధన్యుణ్ణయాను" అని సాధువు అనేటంతలో బాలుడి ముఖంలో ఒక మతాబీ వెలుగు వెలిగింది. విమానం దిగుతున్న శబ్దమైంది. బాలుడు మరి కనపడకుండా అంతర్ధానమయ్యాడు.

నిండు సంతోషంతో సాధువు మళ్ళీ తన గుహలోకి మళ్ళిపొయ్యాడు.





# తీరిన తగాదా

ఒక గ్రామంలో ఒక భూస్వామి ఉండేవాడు. ఆయన కిద్దరు కొడుకులు. వాళ్ళిద్దరూ అస్తమానమూ ప్రతి చిన్న విషయానికీ పోట్లాడుకునేవారు. తాను చచ్చిపోయాక ఆస్తి పంపకాల దగ్గిర వాళ్ళు ఎంతగా తగాదా పడతారోనని, ముసలితనం వచ్చిన భూస్వామి తాను బతికి ఉండగానే ఇద్దరికీ తన ఆస్తిని సమంగా పంచాలని నిర్ణయించాడు. ఆయన తన కున్నదంతా ఇద్దరికీ సమంగా పంచాడు; కొడుకు లిద్దరూ సమ్మతించారు కూడా. అయితే ఒక వజ్రం దిగబడిపోయింది.

ఆ వజ్రం వారి వంశంలో అనేక తరాలుగా ఉంటున్నది. అది పెద్ద కొడుకు వద్ద ఉండటం ఆచారం. దాన్ని అమ్మరాదు. దానం చెయ్యరాదు. అందుచేత భూస్వామి దాన్ని తన పెద్ద కొడుకు కిస్తానన్నాడు. కాని అందుకు రెండో వాడు ఒప్పుకో లేదు. "అది నా ఇంటనే ఉండాలి. నేనే దాన్ని మరొక తరానికి అందజేస్తాను," అన్నాడు రెండో వాడు. పెద్దవాడు అందుకు సమ్మతించ లేదు. ఇద్దరూ తగాదా పడ్డారు.

వాళ్ళ తగాదా పరిష్కారం కావటానికి తండ్రి ఒక నియమం పెట్టాడు. "మీ రిద్దరూ ఏ దేశాలకైనా వెళ్ళి మీ యిష్టం వచ్చిన విద్యలలో ప్రవీణులై రండి. మీలో ఎవరి ప్రావీణ్యం హెచ్చయితే వారికి వజ్రం ఇస్తాను," అని ఆయన అన్నాడు.

అన్నదమ్ము లిద్దరూ బయలుదేరి చెరొక దారినా చెరొక దేశమూ వెళ్ళారు. అయిదేళ్ళ కాలంలో పెద్దవాడు జ్యోతిషంలో నిపుణుడయాడు, చిన్నవాడు రణవిద్యలో ఆరితేరాడు. అయిదేళ్ళూ నిండుతూనే ఆ ఇద్దరూ ఇంటికి తిరిగి వచ్చారు.

అయితే వారు ఇల్లు చేరుకునే సమయానికి ఇంటి వద్ద పరిస్థితి అంతా తారుమారయింది. వారు రావటానికి కొద్ది రోజులు

బి. సుందరరావు



బడుతుంది. ఇదంతా చూడగా పోయిన సొత్తు దొరుకుతుందన్న ఆశ నాకు కలగటం లేదు,'' అన్నాడు.

కాని రణ విద్యలో ఆరితేరి వచ్చిన చిన్న వాడు దొంగలను అంత తేలికగా వదల దలచలేదు. తన అన్న చెప్పిన మాటలు నమ్మి అతను ఈశాన్య దిశగా బయలు దేరాడు. పోగా, పోగా ఒక అరణ్యం వచ్చింది. ఆ అరణ్యంలో బ్రహ్మ రాక్షసు లుంటారని ఆ ప్రాంతాల వాళ్ళు చెప్పారు. అందులోనే దొంగలు కూడా ఉంటారనీ, వారు దోచుకు పోయిన సొత్తంతా అక్కడే ఉంటుందనీ అతనికి నమ్మకం కుదిరింది.

ఆ అరణ్యంలో ప్రవేశించటం ప్రమాద మనీ, అందులోకి వెళ్ళి ఎందరో ప్రాణాలు పోగొట్టుకున్నారనీ విని కూడా చిన్నవాడు భయపడ లేదు. ప్రమాదం పిశాచాల వల్ల కలిగే పక్షంలో దొంగలు ఆ అరణ్యంలో ఎలా ఉంటున్నారు? దొంగలు చేసిన పాటి పని తాను చెయ్యలేడా? ప్రమాదం దొంగల వల్ల నయితే తన వద్ద కరవాలం ఉండనే ఉన్నది! దొంగలను చంపటానికే గదా తాను వచ్చింది? అలాటప్పుడు దొంగలకు భయపడి అరణ్యంలో ప్రవేశించక పోవ టంలో అర్థమే ముంటుందీ?

ముందుగానే బందిపోటు దొంగలు వచ్చి పడి, ఇంట్లో ఉండే సొత్తంతా, వజ్రంతో సహా, కాజేసుకు పోయారు. భూస్వామి దిగులుతో మంచం పట్టాడు. తన కొడుకు లిద్దరిలో ఎవరి ప్రావీణ్యం గొప్పదో విచా రించే స్థితిలో ఆయన లేడు.

పెద్దవాడు జ్యోతిష్కుడు గనక బంది పోటు వచ్చిన తిథి, వార, నక్షత్రాలు అడిగి తెలుసుకుని తన తమ్ముడితో, ''ఈ బంది పోటు దొంగలు ఈశాన్య దిక్కున ఉండే ఒక అరణ్యం నుంచి వచ్చారు. ఆ అరణ్యం పిశాచాలకు స్థావరమైనది. దొంగలకు ఆ పిశాచాల పైన అధిపత్యం ఉన్నట్టు కన

అరణ్యంలో మొదట ఏమీ కనిపించ లేదు గాని వికృతమైన ధ్వనులు వినిపించాయి. చిన్నవాడు వాటిని లక్ష్య పెట్టలేదు. కొంత సేపయాక పిశాచాలు వికృతాకారాలతో అక్కడక్కడా కనిపించసాగాయి. అతను కత్తి దూసి వాటిని చంప యత్నించగా అవి మాయమవుతూ వచ్చాయి.

"పిశాచాల్లారా, మీ ఆటలు నా దగ్గిర సాగవు. ఈ వనంలో దొంగ లెక్కడ ఉంటున్నారో చెప్పండి. లేకపోతే మిమ్మల్ని నా కత్తితో చిత్రవధ చేస్తాను," అన్నాడతను. వెంటనే పిశాచాలు మాటుమణిగాయి, అవి మరి కనిపించలేదు, వాటి అలికిడి వినిపించ లేదు.

చిన్నవాడికి ఆకలి అయింది. తాత్కాలికంగా పిశాచాలు తనను వదిలి వెళ్ళిపోయినట్టు తోచి, అతను ఒక చెట్టు కింద కూర్చుని, తన కత్తి పక్కన పెట్టుకుని, తాను తెచ్చుకున్న మూట విప్పి, అందులో ఉన్న ఆహారం తినసాగాడు. ఆ సమయంలో ఒక పిశాచం అదృశ్యంగా వెనక నుంచి వచ్చి, అతని పక్కన ఉన్న కత్తి తీసుకుని పోయి, దాన్ని తమ నాయకుడి కిచ్చింది.

"కత్తి లేదు గనక ఇంక ఈ మనిషి మన నేమీ చెయ్యలేడు. మనం వాణ్ణి చూసి




భయపడం, మనని చూసి వాడే భయపడతాడు," అన్నాడు పిశాచాల నాయకుడు.

చిన్నవాడు భోజనం పూర్తిచేసి తన కత్తి పోయిన సంగతి తెలుసుకుని, పిశాచాలే ఈ పని చేశాయని గ్రహించాడు. వాటిని మోసపుచ్చటానికి ఒక ఎత్తు ఆలోచించి, అతను అరణ్యం దాటి ఇవతలికి వచ్చేశాడు.

అతను వెళ్ళి పోవటం గమనిస్తూ ఉండిన పిశాచాలు విజయ గర్వంతో గంతులు వేశాయి.

చీకటి పడింది. పిశాచాలు రకరకాల రూపాలు ధరించి నాట్యం ప్రారంభించాయి. పట్టపగలు తమను చూసి భయపడి వెళ్ళి



పోయిన వాడు రాత్రి చీకటిలో తాముండే చోటికి తిరిగి వస్తాడని పిశాచాలకు తట్టలేదు. కాని చిన్నవాడు అవి నృత్యాలు చేస్తున్న చోటికి నల్లని గుడ్డ ముసుగు వేసుకుని వచ్చాడు. అతని కత్తిని ఒకదాని కొకటి అందిస్తూ పిశాచాలు పరమానందంతో నృత్యం చేస్తున్నాయి. చిన్నవాడు కొంత సేపు ఆ పిశాచాలతో కలిసి నృత్యం చేశాక, తన కత్తి వాడి చేతికి వచ్చింది.

వెంటనే అతను కత్తి చేత పట్టుకుని పిశాచాల నాయకుడి మీదికి ఉరికి, వాడి గడ్డం రెండో చేత్తో పట్టుకుని కత్తితో ఒక్క వేటున గడ్డాన్ని కోసేశాడు.

వెంటనే పిశాచాల నాయకుడు పెద్ద కేక పెట్టి, "అయ్యో, అయ్యో! నా వెంట్రుకలు!" అని అరిచాడు. పిశాచాలన్నీ స్తంభించిపోయాయి. పిశాచాలు ఎందుకలా కంగారులో పడినదీ వాడికి అర్థంకాలేదు.

పిశాచాల నాయకుడు చేతులు జోడించి, "బాబూ, బాబూ! నా గడ్డం వెంట్రుకలు నా కిచ్చెయ్యి. బందిపోటు దొంగల నాయకుడు నా గడ్డం వెంట్రుక ఒక్కటి సంపాదించి నన్నూ, నా పరివారాన్నీ తనకు బానిసలుగా చేసుకుని నానా తిప్పలూ పెట్టుతున్నాడు. నీ చేతిలో అన్ని వెంట్రుకలుంటే ఇక మాది కుక్క బ్రతుకే!" అన్నాడు.

"మిమ్మల్ని బానిసలుగా ఉంచుకోవాలన్న కోరిక నా కేకోశానా లేదు. నాకు కావలిసింది ఆ దొంగలుండే రహస్య ప్రదేశం. నాకు వాళ్ళను చూపించారా, మీ కందరికీ ఆ దొంగల నాయకుడి పీడ లేకుండా చేసేస్తాను. అందుచేత నాకు ఈ కాస్త సహాయం చెయ్యండి. ఆ తరవాత మిమ్మల్ని శాసించే వాడుండడు!" అని చిన్నవాడు పిశాచాలకు నచ్చ జెప్పాడు.

ఆ రాత్రి దొంగలు దొంగతనానికి వెళ్ళారు. తెల్లవారి వస్తారు. నాయకుడితో సహా పదిమంది దొంగలు. ఈ విషయాలు

చెప్పి పిశాచాల నాయకుడు చిన్నవాణ్ణి దొంగలుండే భూగృహం వద్దకు తీసుకు పోయాడు. చిన్నవాడు అక్కడ ఒక చెట్టు చాటున దాగి ఉన్నాడు.

తెల్లవారు తూండగా దొంగలు సొత్తుతో వచ్చారు. నేలలో ఉన్న రహస్యమైన తలుపు ఎత్తి, మెట్లు దిగి పదిమందీ కిందికి వెళ్ళి పోయారు. వాళ్ళు సొత్తంతా లోపల దాచి మెట్ల మీదుగా పైకి వచ్చేటప్పుడు చిన్న వాడు తన కత్తితో ఒక్కొక్కడి తలా నిశ్శబ్దంగా నరికేశాడు.

ఇలా పదిమంది దొంగలూ చచ్చాక చిన్న వాడు భూగృహంలోకి దిగి అక్కడ ఉన్న ధనరాసులన్నీ చూశాడు. అందులో తమ సొత్తంతా, వజ్రంతో సహా, ఉన్నది. తరువాత అతను రాజుగారి వద్దకు వెళ్ళి తాను బంది పోట్లను హతమార్చిన సంగతి తెలిపి, వాళ్ళు దోచిన సొత్తుండే చోటు చూపుతాననీ, అందులో తమ సొత్తు తాను తీసుకుంటా ననీ, మిగిలినది రాజుగారు న్యాయంగా అసలు వాళ్ళ కివ్వవచ్చుననీ చెప్పాడు.

రాజభటులు అతని వెంట వెళ్ళి భూగృహంలోని సొత్తంతా రాజభవనానికి చేరవేశారు. రాజుగారి అనుమతితో చిన్న వాడు తమ సొత్తును తన వెంట పెట్టుకుని ఇంటికి వచ్చేశాడు.

పోయిన సొత్తు తిరిగి దొరకగానే భూస్వామి మనసు తేలిక పడి, లేచి కూర్చున్నాడు.

ఆయన తన కొడుకులను పిలిచి, "ఇంతకూ ఆ వజ్రం మీలో ఎవరికి చెందే టట్టు? ఆ తగాదా అలాగే ఉండిపోయింది గదా!" అన్నాడు.

"దానికి తగాదా ఎందుకు? అది పెద్ద వాడికి చెందటమే ఆచారంగా వస్తున్నది గనక అన్న దగ్గిరే ఉంచండి," అన్నాడు చిన్నవాడు. విద్యలు నేర్చి ప్రయోజకుడైనాక వాడికి విశాల దృక్పథం ఏర్పడింది.



# తలవంచనివాడు

భీమరాజు అనే గొప్ప శ్రీమంతుడికి సత్యవతి అనే కూతురుండేది. ఆ పిల్ల తప్ప వేరే సంతానం లేనందున, ఆయన తన కుమార్తెకు యోగ్యుడైన వరుణ్ణి చూసి పెళ్ళి చేసి, తన ఇంటనే ఉంచుకుని, తన తదనంతరం తన ఆస్తిని అల్లుడికే ఇవ్వాలని ఉద్దేశించాడు. ఇదేమంత పెద్ద కోరిక కానప్పటికీ అది తీరటం దాదాపు అసాధ్యమైపోయింది.

ఏమంటే, భీమరాజు భార్య నరసమ్మ గయ్యాళి గచ్చపాద. బయట ఎంత పేరు ప్రఖ్యాతులున్నా, భీమరాజు ఆమె ముందు పిల్లిలా అయిపోయే వాడు. ఆమె ఎవరి మాటా వినదు. అందరూ ఆమె మాట వినాలి—అదీ ఆమె వైఖరి. భర్త ఎప్పుడైనా పొరపాటున స్వతంత్రంగా ఏదైనా చేస్తే ఆమె మహంకాళి అయిపోయేది. తన కూతురు కూడా తన కాబోయే భర్తను చెప్పు కింది తేలులాగా ఉంచుకోవాలని ఆవిడ అభిప్రాయం.

కాని సత్యవతికి తగిన సంబంధాలు రాలేదు. ఆమె తల్లి సంగతి తెలిసిన వారెవరూ ఆమెను చేసుకోవటానికి ఒప్పుకోలేదు; అత్తవారింటనే ఉండిపోవాలన్న నియమానికి అసలే ఒప్పుకో లేదు. కలవారితో సంబంధం గదా అని కక్కుర్తి పడి ఎవరైనా సత్యవతిని పెళ్ళాడతామని వస్తే వాళ్ళు నరసమ్మకు నచ్చలేదు.

ఆమె పెళ్ళిళ్ళ పేరయ్య నొకణ్ణి పట్టుకుని, "అమ్మాయికి తగిన సంబంధం ఎక్కడైనా దొరుకుతుందేమో చూడండి. పిల్లవాడికి ఆస్తి పాస్తులుండ నవసరం లేదు. అమ్మాయికి తగిన జోడుగా ఉండాలి. ఆపైన అల్లుడు మన దగ్గిరే ఉండి, మన చెప్పు చేతలలో మెలగటం ముఖ్యం," అని చెప్పింది.

కె. వెంకటరామయ్య

పెళ్ళిళ్ళ పేరయ్యా కాళ్ళకి బలపాలు కట్టుకుని ఊరూరూ తిరిగాడు. కాని నర సమ్మకు నచ్చే సంబంధం ఎక్కడా కని పించలేదు. ఒక గ్రామం నుంచి ఆయన మరొక గ్రామానికి పోతూ ఉండగా ఒక రావి చెట్టు కింద ఒక యువకుడు విచారంగా కూర్చుని కనిపించాడు. అతడి వయస్సు ఇరవై ఉండవచ్చు, కాని చాలా పొట్టి వాడు. అతనిలో మరే లోపాలూ లేవు, సలక్ష ణంగా ఉన్నాడు.

"ఏం, నాయనా? ఎవరు నువు? ఎందు కిలా విచారంగా కూర్చుని ఉన్నావు?" అని పెళ్ళిళ్ళ పేరయ్యా ఆ కుర్రవాణ్ణి అడిగాడు.

దానికా కుర్రవాడు, "నా పేరు గరటన్న. ఈ పక్క గ్రామంలో ఉండే అయ్యాప్పగా రబ్బాయిని. మా నాన్న నన్ను చూసినప్పు డల్లా రుసరుసలాడుతాడు. 'ఈ పొట్టి వెధ వకు ఎవరూ పిల్ల నివ్వరు! వీ డెందుకూ పనికిరాడు,' అని శాపనార్థాలు పెడుతూం టాడు. ఈ శాపనార్థాలు వినీ, వినీ నాకు ప్రాణం విసిగిపోయింది. ఇంటి నుంచి బయలుదేరి వచ్చేశాను. ఎక్కడికైనా వెళ్ళి ఎలాగో బతుకుతాను!" అన్నాడు.

"ఓరి, పిడుగా! అయ్యాప్ప కొడుకు గరట్రాజువా నువ్వూ? ఏదీ నీ చెయ్యి ఒక్క



పర్యాయం చూడనీ!" అంటూ పెళ్ళిళ్ళ పేరయ్యా గరటన్న చెయ్యి తీసుకుని, హస్త సాముద్రికం తెలిసిన వాడిలాగా పరీక్షించి, "నీ తండ్రి ఎంత పిచ్చివాడు! నీకు శ్రీమం తుల పిల్ల రాసిపెట్టి ఉన్నది. గొప్ప ధన యోగం! అందరూ నీకు తల వంచవలి సిందే! అలాటి జాతకం నీది! నా వెంట రా, చెబుతాను," అన్నాడు.

ఈ మాట విని గరటన్న పరమానందం చెందాడు. పెళ్ళిళ్ళ పేరయ్యా తన పాలిటి భాగ్యదేవతగా వాడికి కనిపించాడు. ఇద్దరూ కలిసి బయలుదేరారు. దారిలో పెళ్ళిళ్ళ పేరయ్యా గరటన్నకు ఒక సలహా ఇచ్చాడు:

"ఎవరుగానీ నీ ఎత్తుకు వంగి మాట్లాడితే గాని జవాబు చెప్పకు."

అయన కుర్రవాణ్ణి తన ఇంట ఉంచి నరసమ్మ వద్దకు వెళ్ళి, "అమ్మాయికి భేషైన వరుణ్ణి తెచ్చాను. అబ్బాయిలో ఒకటే కాస్త లోపం కనిపిస్తున్నది—పొట్టి వాడు," అన్నాడు.

"ఏం పొట్టివాడైతే? మరీ మంచిది! చెప్పిన మాట మరింత బాగా వింటాడు," అన్నది నరసమ్మ.

"బాగా చెప్పారు. అయితే ఒకటుంది. మనం వొంగి మాట్లాడితే గాని జవాబు చెప్పడు—పొట్టివాడు కాదూ?" అన్నాడు పెళ్ళిళ్ళ పేరయ్య.

"దానికేం? అదేమంత కష్టమైన పని! అలాగే మాట్లాడదాం," అన్నది నరసమ్మ సంతోషంగా.

పెళ్ళి చూపులయాయి, పెళ్ళి కూడా అయింది. పెళ్ళి పీటల మీదనే నరసమ్మ అల్లుణ్ణి అదుపులో ఉంచాలని చూసింది. కాని వాడు ఆమెను లక్ష్యపెట్టలేదు; ఆమె వంగి మాట్లాడితేనే గాని జవాబు కూడా చెప్ప లేదు.

పెళ్ళి కాగానే వధూవరులను గుడికి తీసుకుపోయారు.

దారిలో నరసమ్మ పెళ్ళిళ్ళ పేరయ్యతో, "అల్లుడితో అస్తమానమూ వంగి మాట్లాడవలిసిందేనా? చాలా కష్టంగా వున్నది," అన్నది అసంతృప్తిగా.

ఇంతలో అందరూ గుడి ద్వారం చేరుకున్నారు. ద్వారం చాలా పొట్టిది. అందరూ తలలు వంచి గుడి ఆవరణలోకి వెళ్ళితే గరటన్న మాత్రం తల వంచకుండానే లోపలికి వెళ్ళాడు.

"చూశారా? వాడు దేవుడికే తల వంచే రకం కాదు, మనకు వంచుతాడా?" అన్నాడు పెళ్ళిళ్ళ పేరయ్య. నరసమ్మ నోరు వెళ్ళబెట్టింది.





# జోమాలుడి ప్రజ్ఞ

చిత్రాపురంలో గ్రామదేవత గుడికి జోమాలుడు పూజారి. ఎటువంటి పేచీలూ, తగాయిదాలూ వచ్చినా తగిన సమాధానం చెప్పి, ఇరు పక్షాల వారికీ తృప్తి కలిగించి, శాంత పరచే వాడు. ఇలా పరిష్కారం చెయ్యటంలో అత డెన్నడూ ప్రతి ఫలం అపేక్షించ లేదు.

ఈ వార్త ఆ రాజ్యాన్ని ఏలే ప్రభువు చెవిని పడింది. రాజు మంత్రితో ఆలోచించి, ఒక రోజున మారువేషంలో ఇద్దరూ గుడికి వెళ్ళారు. అక్కడ పూజ చేయించి, పూజారి యోగక్షేమాలు అడిగి తెలుసుకుని, వెనక్కు మళ్ళారు.

ఆ గ్రామ ప్రజలు దగ్గరలో ఉండే అడవికి పోయి కట్టెలు కొట్టి తెచ్చుకుంటూ వుంటారు. ఒకనాటి ఉదయం ఒకడు అడవికి పోతుంటే దారిలో చెట్టు కింద ఒక జ్యోతిష్కుడు కనబడ్డాడు.

ఆ మనిషి తన చెయ్యి చూసి చెప్పమన్నాడు. అందుకు జ్యోతిష్కుడు, "అబ్బాయీ, నీ కళ్ళకు నా ప్రభావం వల్ల ఒక దృశ్యం కనబరుస్తాను. దానికి తగిన జవాబు చెప్పగలిగితే నీ భవిష్యత్తు చెబుతాను" అన్నాడు. "సరే" అన్నాడు ఆ మనిషి.

చూస్తూండగానే అతని కళ్ళ యెదట మిలమిలా మెరిసిపోతూ ఒక గొప్ప రాజభవనం కనిపించింది.

అంతలోనే ఆకాశాన మెరపులు మెరసి, ఉరుము లురిమి, పిడుగులు పడి, కుంభవృష్టిగా వర్షం కురిసింది. ఆ భవనం కూలి, నేల మట్టమయింది.

"దీని అర్థం ఏమిటి?" అని అడిగాడు జ్యోతిష్కుడు.

"తెలియదు. మీరే చెప్పండి స్వామీ," అన్నాడు అతను.

జి. కృష్ణమూర్తి




మీ దగ్గర కనబడటం లేదు, కాబట్టే మిమ్మల్ని గౌరవంగా అడుగుతున్నాను'' అన్నాడు జోమాలు.

''సరిగా ఊహించావు. నీ కేమైనా భవిష్యత్తు తెలుసుకోవాల నుందా?'' అని అడిగాడు మంత్రవాది.

లే దన్నాడు జోమాలు.

''ప్రతి వాళ్ళకూ తీవ్రంగా ఉండే ఈ వాంఛ నీకు లేకపోవడం ఆశ్చర్యంగా వుంది. విరక్తి వల్లనా?'' అని మళ్ళీ అడిగాడు మంత్రవాది.

అందుకు జోమాలు, ''విరక్తి కాదు. మంచి వుద్దేశంతో భగవంతుడు మన భవిష్యత్తును మరుగులో వుంచగా, అకారణంగా సరదా కోసం దాన్ని తెలుసుకోవాలని ఉబలాట పడటం తప్పు అని నా వుద్దేశం'' అన్నాడు.

''బాగా చెప్పావు. ఇప్పు డీ ముగ్గురు శిలారూపుల్నీ మామూలుగా మార్చమనే కదా నీ కోరిక? అలా అయితే, ఆ ముగ్గురూ చూచిన మూడు దృశ్యాలకూ నువ్వే బదులు చెప్పాలి. చెప్పలేకపోతే నువ్వూ శిలగా మారిపోతావు. ఏం, ఒప్పుదలేనా?'' అని అడిగాడు మంత్రవేత్త.

''ఓ, ఒప్పుకుంటాను. ఆ సమస్యలేమిటో సెల వివ్వండి'' అంటూ జోమాలు సిద్ధపడ్డాడు.

అప్పుడు మంత్రవాది మొదటి దృశ్యాన్ని మళ్ళీ సృష్టించి, మాయం చేసి, అర్థం చెప్పమన్నాడు.

దానికి జోమాలు ''సమస్త సదుపాయాలతో కూడుకున్న మహాభవనమే అయినా, పునాది దిట్టంలేక అది వర్షాధిక్యం వల్ల పడిపోయింది. అలాగే మన జీవిత మనే గృహాన్ని సత్సహవాసం అనే పునాదితో బలం చేసుకోకుంటే, ఉరుము, పిడుగుల వంటి దుష్ట స్నేహితులు చేరి జీవితాన్ని సులువుగా పాడుచేస్తారు'' అని చెప్పగానే,

వాయువేగంతో ఊరంతా అల్లుకుపోయింది. ధైర్యం గల కొంత మంది సరాసరి అతని వద్దకు వెళ్ళి, "నువ్వెవరవు? నీ సంగతి ఏమిటి?" అని అడిగారు.

దాని కతడు "నేను భవిష్యం చెప్పే వాణ్ని. దృశ్యం చూపించి అర్థం అడుగుతాను. సరిగా చెప్ప గల వాళ్ళకు ముందు జరగబోయేది చెబుతాను. చెప్పలేనివాళ్ళు ఇలా శిలామూర్తులు కావలిసిందే" అంటూ, మూడు శిలలనూ, వారికి చూపించాడు.

అందరూ భయపడి, వెనకడుగు వేశారు. కట్టెల కోసం పోయిన ఆ ముగ్గురి తాలూకు వాళ్ళూ తిన్నగా గోలపెట్టుకుంటూ అర్చకుడు జోమాలు దగ్గరకు పోయారు.

"ఆ సంగతి ఏదో నే చూస్తా" నని చెప్పి, జోమాలు వారిని పంపివేసి, మరునాడు జ్యోతిష్కుడి వద్దకు వెళ్ళాడు.

"అయ్యా, మహానుభావా! మీరు చేసే పనులు చూసి మా ఊరి వాళ్ళందరూ భయపడుతున్నారు. ఈ శిలారూపాలు చూడగా, వాళ్ళ భయం పోగొట్టటానికి మీరే సమర్థులని తోస్తుంది. దయచేసి వాళ్ళను మళ్ళీ మనుషులుగా మార్చి, వాళ్ళ కుటుంబాలను కాపాడాలని వేడుకుంటున్నాను" అన్నాడు జోమాలుడు.



ఈ మాటలకు మంత్రవాది, "ఈ గ్రామానికి నువ్వేనా పెద్దవు? అందరూ నన్ను చూసి భయపడుతూంటే, నువు మాత్రం నన్ను గౌరవించవలసిన కారణ మేమిటి? ఇలాటి కపట వినయాలు మా దగ్గర పనికిరావు" అంటూ గద్దించాడు.

"కపట వినయం కాదండి స్వామీ!—నాకూ కొద్దిగా మంత్రాలూ, జ్యోతిషమూ తెలుసు. మిమ్మల్ని చూస్తే చెడ్డ వుద్దేశం కలవారుగా తోచదు. నిజంగా చెడ్డవారే అయితే మనుషుల్ని శిలలుగా మార్చడ మేవిటి, భస్మమే చేసి వుందురు. పైగా దురుద్దేశాన్ని సూచించే ఉపకరణా లేవీ




మీ దగ్గర కనబడటం లేదు, కాబట్టే మిమ్మల్ని గౌరవంగా అడుగుతున్నాను" అన్నాడు జోమాలు.

"సరిగా ఊహించావు. నీ కేమైనా భవిష్యతు తెలుసుకోవాల నుందా?" అని అడిగాడు మంత్రవాది.

లే దన్నాడు జోమాలు.

"ప్రతి వాళ్ళకూ తీవ్రంగా ఉండే ఈ వాంఛ నీకు లేకపోవడం ఆశ్చర్యంగా వుంది. విరక్తి వల్లనా?" అని మళ్ళీ అడిగాడు మంత్రవాది.

అందుకు జోమాలు, "విరక్తి కాదు. మంచి వుద్దేశంతో భగవంతుడు మన భవిష్యత్తును మరుగులో వుంచగా, అకారణంగా సరదా కోసం దాన్ని తెలుసుకోవాలని ఉబలాట పడటం తప్పు అని నా వుద్దేశం" అన్నాడు.

"బాగా చెప్పావు. ఇప్పు డీ ముగ్గురు శిలారూపుల్నీ మామూలుగా మార్చమనే కదా నీ కోరిక? అలా అయితే, ఆ ముగ్గురూ చూచిన మూడు దృశ్యాలకూ నువ్వే బదులు చెప్పాలి. చెప్పలేకపోతే నువ్వూ శిలగా మారిపోతావు. ఏం, ఒప్పుదలేనా?" అని అడిగాడు మంత్రవేత్త.

"ఓ, ఒప్పుకుంటాను. ఆ సమస్యలేమిటో సెల వివ్వండి" అంటూ జోమాలు సిద్ధపడ్డాడు.

అప్పుడు మంత్రవాది మొదటి దృశ్యాన్ని మళ్ళీ సృష్టించి, మాయం చేసి, అర్థం చెప్పమన్నాడు.

దానికి జోమాలు "సమస్త సదుపాయాలతో కూడుకున్న మహాభవనమే అయినా, పునాది దిట్టంలేక అది వర్షాధిక్యం వల్ల పడిపోయింది. అలాగే మన జీవిత మనే గృహాన్ని సత్సహవాసం అనే పునాదితో బలం చేసుకోకుంటే, ఉరుము, పిడుగుల వంటి దుష్ట స్నేహితులు చేరి జీవితాన్ని సులువుగా పాడుచేస్తారు" అని చెప్పగానే,

మొదటి శిలారూపానికి సహజ రూపం వచ్చేసింది.

మాంత్రికుడు రెండవ దృశ్యాన్ని జోమాలుకు చూపించి, "దీని కేమంటావు?" అని అడిగాడు.

"దీని కేముంది?—చెట్టు కొమ్మల్లో తల దాచుకుంటున్న వేలాది చిన్న పక్షుల్ని భూతాకారం దాల్చిన పెద్ద గద్ద కబళించ డంలో వింత లేదు. బలిష్ఠులైన దుష్టులు కారణం లేకనే వాళ్ళ స్వార్థం కోసం దుర్బలులను పీడించటం సృష్టిలో జరుగు తున్న పనే కదా!" అని జోమాలు అనే సరికి రెండవ శిల యథారూపం తాల్చింది.

తరువాత మూడవ దృశ్యానికి జోమాలు ఇలా బదులు చెప్పాడు: "ఇది అను క్షణమూ మనం చూచే గొప్ప అనుభవం. వీపు పైన మోయలేనంత బరువున్నా, చావ సిద్ధంగా వున్న ఆ ముసలివాడు ఇంకా చితు కులు కోసం ఆరాటపడుతున్నాడంటే, ఆశా పాశం యొక్క ప్రభావం ఎంత మహత్తర మైందో మానవుడు ఇట్టె తెలుసుకోవచ్చు. కనుక దాన్ని తెంచుకోగల వాడే జ్ఞాని అన్న మాట" అని చెప్పే సరికి, శిలగా మారిన మూడవ కట్టెలవాడు కూడా మామూలు మనిషిగా మారాడు.

మంత్రవాది నవ్వుతూ, "జోమాలీ! ఇక యిప్పుడు నువు అడక్కపోయినా నీ భవిష్యతు చెబుతా విను; రేపటి రోజున రాజుగారు నిన్ను ఆహ్వానిస్తారు, నువ్వు ఘనమైన సన్మానం పొందుతావు. నీ యోగ్యత పరీక్షించటానికి రాజుగారే నన్నిలా పంపిం చారు. నే నొక ఐంద్రజాలకుణ్ని. రేపు తప్పక ఆయన దగ్గరకు వెళ్ళి, సన్మానం పొందు" అని చెప్పాడు.

అర్చకుడు జోమాలు అలాగే రాజు గారి వల్ల సన్మానం పొందాడు. నాటినించీ అతని పేరు ప్రఖ్యాతులు దేశంలో ఇంకా వృద్ధి పొందాయి.





# రెండు నగరాలు

ఒక ఓడ వ్యాపారి వద్ద వామాంగుడనే ఒక బానిస ఉండే వాడు. వామాంగుడు తన వ్యాపారంలో ఎంతో సహాయపడి, లాభాలు సమకూర్చి పెట్టటంచేత యజమాని అతనికి స్వేచ్ఛ ఇస్తూ, "నా ఓడల్లో ఒకటి తీసుకుని స్వతంత్రంగా వర్తకం సాగించి, బాగుపడు," అన్నాడు.

వామాంగుడి తొలి వర్తక ప్రయాణం అచ్చి రాలేదు. సముద్ర మధ్యంలో తుపాను వచ్చి, సరుకులన్నిటితో సహా అతని ఓడ మునిగిపోయింది. నావికు లంతా సముద్రం పాలయ్యారు. వామాంగుడు మాత్రం ఈదుకుంటూ వెళ్ళి ఒక తీరాన్ని చేరుకున్నాడు.

అది ఒక ద్వీపం. వామాంగుడు ద్వీపంలోకి ప్రవేశించి, కొంత దూరం నడిచి, ఒక పెద్ద నగరం చేరుకున్నాడు.

నగర వీధుల నిండా జన మున్నారు. వారు తన కోసమే గుంపులుగా కూడినట్టు వామాంగుడి కనిపించింది. అతను సమీపానికి రాగానే, "మహారాజుకు జై!" అని జనం నినాదాలు చేశారు. ఇది చూసి వామాంగుడు మరింత ఆశ్చర్యపడి, "వీళ్ళు నన్ను చూసి మరొకరని భ్రమపడుతున్నట్టున్నారు," అనుకున్నాడు.

జనం వామాంగుడి చుట్టూ మూగారు. అక్కడికి అలంకరించిన ఏనుగు ఒకటి వచ్చింది.

జనం వామాంగుణ్ణి దాని అంబారీలో ఎక్కించి, రాజ మర్యాదలతో రాజ భవనానికి తీసుకుపోయారు.

తరవాత రాజభవనంలో అతని దుస్తులు తీసివేసి ఒక పెట్టెలో భద్రపరిచి, అతనికి స్నానం చేయించి, రాజోచితమైన దుస్తులు ధరింప జేశారు.

వామాంగుడు తన చుట్టూ ఉండే వారిని, "మీరు నన్ని విధంగా రాజును చెయ్య

పి. ఆదినారాయణ

టంలో గల అంతరార్థ మేమిటి? నన్ను మీ రెరగరు. మిమ్ము నే నెరగను. ప్రమాద వశాన సముద్రం మీద నా ఓడ మునిగి దైవికంగా ఇక్కడ వచ్చి పడ్డాను. అంతే కాని పని పెట్టుకుని ఈ దేశం వచ్చినవాణ్ణి కాను," అన్నాడు.

అప్పు డక్కడి వారు అతనికి ఆ దేశం గురించి చెప్పారు. ఇరవైరెండేళ్ళ క్రితం దాకా ఆ ద్వీపం మీద క్రమ పరిపాలన అంటూ ఉండేది కాదు. జీవితం అరాజకంగా ఉండేది. ఆ సమయంలో ఆ ద్వీపానికొక దేశ సంచారి వచ్చాడు. ఒక రాజు ఉండి శాసించినట్టయితే జీవితం క్రమబద్ధంగా అభివృద్ధి చెందుతుందనీ, రాజ శాసనం ద్వారా పైకి వచ్చిన దేశా లెన్నో ఉన్నాయనీ, రాజు నిరంకుశుడై ప్రజలను పీడించకుండా ఉండాలంటే ఏడాది కాగానే ఉన్న రాజును తొలగించి కొత్త రాజును పెట్టుకోవచ్చుననీ, రాజు ప్రజలలో ఒకడుగా ఉండే దాని కన్న పై వాడైతే పరిపాలన నిష్పక్షపాతంగా ఉంటుందనీ ఆ దేశ సంచారి చెప్పాడు. అది మొదలు అక్కడి వాళ్ళు యాదృచ్ఛికంగా తమ ద్వీపానికి వచ్చేవాణ్ణి రాజుగా చేసుకుని, అతన్ని పరిపాలించనిస్తున్నారు. ఏడాది పూర్తి కాగానే రాజును తొలగించి సమీపంలో ఉండే అర



ణ్యంలోకి పంపేసి, కొత్తవాడి కోసం ఎదురు చూస్తారు. అరణ్యానికి పంపబడ్డవాడు ఎలా బతుకుతాడో, ప్రజలకు ఏమాత్రం పట్టదు.

ఈ విధంగా ఆ ద్వీపానికి యింతవరకూ ఇరవై ఇద్దరు రాజు లయారు. వామాంగుడు ఇరవైమూడో రాజు.

వామాంగుడికి తనకు పట్టిన రాజయోగం గురించి సంతోషం కన్న, ఏడాది అయాక పట్టబోయే అరణ్యవాసం గురించి శ్రద్ధ ఎక్కువ కలిగింది. అతను కొందరు భటులను వెంట బెట్టుకుని అరణ్యానికి పోగోరాడు. ఈ ద్వీపానికి దగ్గరలోనే మరొక ద్వీపం పైన ఆ అరణ్యం ఉన్నది. అక్కడికి పడవల్లో వెళ్ళాలి.

వామాంగుడు అరణ్యాన్ని ఆ మూలాగ్రం పరిశీలించాడు. అందులో మనుషులు జీవించటం కష్టం. అయితే అక్కడ మంచి కలపా, పంటలు పండించేందుకు సారవంతమైన భూమీ ఉన్నది.

అడవిచెట్లన్నీ కొట్టించి అక్కడ మంచి నగరం నిర్మించవచ్చు, పళ్ళతోటలూ, పూలతోటలూ వేయవచ్చు.

వామాంగు డీ పనికి మనుషులను నియోగించాడు. అతని ఏలుబడి ఏడాది పూర్తి అయేలోగా అరణ్యం అందమైన నగరంగా మారిపోయింది.

నగరం చుట్టూ అందమైన తోటలు ఏర్పడ్డాయి. నగరం నిర్మించటానికి శ్రమించిన వారు ఈ కొత్త నగరంలోనే నివశించ గోరారు.

ఏడాది పూర్తి అయింది. వామాంగుడు కొత్త నగరానికి వచ్చేశాడు. అతనితోబాటు అనేక మంది పౌరులు, పాత నగరం వారు, కొత్త నగరానికి వలస వచ్చేశారు. పాత నగరం వారికి వామాంగుణ్ణి పోగొట్టుకోవటం ఇష్టం లేకపోయింది. వా రొక సభ చేసి, రెండు నగరాలకూ వామాంగుడే శాశ్వతంగా రాజుగా ఉండాలని తీర్మానించారు.





# యుద్ధకాండ

హనుమంతుడు చెప్పినదంతా విని రాముడు పరమసంతోషం చెంది, "ఆహా, ఈ హనుమంతుడు చేసిన పని మరెవరు చెయ్యగలరు? ఇతరులు తలపనైనా తలపలేరు గదా! సముద్రాన్ని దాటటం గరుత్మంతుడికీ, వాయుదేవుడికీ, ఈ హనుమంతుడికీ తప్ప మరెవరికీ సాధ్యమయే పని కాదు. అంతతో పోక ఈ హనుమంతుడు దేవతలకు సైతం ప్రవేశించరాని లంకను ప్రవేశించాడు! ప్రవేశించటమే కాదు, ప్రాణాలతో తిరిగివచ్చాడు! అక్కడ అశోకవన భంగమూ, రాక్షస సంహారమూ, లంకా దహనమూ మొదలైన అద్భుత కార్యాలు చేశాడు! సీతనూ, నన్నూ ఈ హనుమంతుడు కాపాడిన వాడైనాడు. ఇతనికి ఏమి ఇచ్చినా తీరదు. అన్నిటికీ బదులుగా ఆలింగనం చేసుకుంటాను," అంటూ హనుమంతుణ్ణి కౌగలించుకున్నాడు.

తరవాత రాముడు సుగ్రీవుడితో, "సీతను వెతకటంలో కృతకృత్యుల మయామేగాని ఆ సముద్రాన్ని తలుచుకుంటే నా మనసు కుంగిపోతున్నది. దాని దక్షిణ తీరానికి ఎలా చేరుకునేట్టు?" అంటూ విచారంలో మునిగి పోయాడు.

అప్పుడు సుగ్రీవుడు రాముణ్ణి చూసి, "ఎందుకు విచారం? అది కార్యహాని హేతువు. సముద్రానికి సేతువు కట్టి లంకలో అడుగుపెట్టే ఉపాయం ఆలోచించామంటే ఆ రావణుడు చచ్చిన వాడి కిందనే లెక్క. సముద్రానికి సేతువు కట్టకుండా లంకను





హనుమంతు డీ విధంగా చెప్పాడు :

"లంకలోని వారంతా సంతృప్తులు, అసంతృప్తు లక్కడ లేరు. నగరం విశాల మైనది. పుష్కలంగా చతురంగ బలాలు గలది. దానికి నాలుగు పెద్ద ద్వారా లున్నాయి. ద్వారాల వద్ద శత్రు సైన్యాలను నాశనం చెయ్యడానికి బ్రహ్మాండమైన రాళ్ళు విసిరే యంత్రాలున్నాయి, నూరేసి మందిని చంప గల శతఘ్నులున్నాయి. నగరం చుట్టూ దాటరాని ప్రాకారం ఉన్నది. దాని చుట్టూ లోతైన అగడ్త ఉన్నది. దానిని దాటటానికి ద్వారాల సమీపంలో క్రర వంతెన లున్నాయి. వాటిని యంత్ర సహాయంతో ఎత్తవచ్చు, దించవచ్చు. శత్రువులు వచ్చి నప్పుడు వాటిని ఎత్తివేస్తే, అగడ్తను దాటటం అసాధ్యం. రావణుడు చాలా మెల కువ గల వాడు, శత్రు భయం లేనప్పుడు కూడా తన సైన్యాన్ని యుద్ధ సన్నద్ధంగా ఉంచుతాడు. లంకకు నాలుగు రక్షలున్నా యనవచ్చు. ఒకటి, చుట్టూ ఉండే సముద్రం. లంక ఎత్తుగా త్రికూటపర్వతం పైన ఉండటం చేత దానిని ఎక్కి లంకను చేరాలి. ఆ పర్వతం రెండో రక్ష. అక్కడ ఉండే అరణ్యం మరొక రక్ష. నాలుగో రక్ష అగడ్తా, పరిఘలూ, యంత్రాలూ, శత

జయించటం దేవతలకే సాధ్యం కాదు. అందుచేత విచారం విడిచిపుచ్చి కర్తవ్యం ఆలోచించు. నీకు జయం కలుగుతుందన టానికి ఏ సందేహమూ లేదు," అన్నాడు.

ఈ మాటలతో రాముడు తేరుకుని, "తపస్సు చేసో, సేతువు కట్టో, సముద్రాన్ని ఇంకించో, ఏదో విధంగా లంకకు చేరి తీరు తాను. ఆ విషయమై ఇంక విచారించను," అంటూ హనుమంతుడితో, "లంకకు ఎన్ని దుర్గాలున్నాయి? ఎంత సైన్యం ఉన్నది? ద్వారరక్షణ ఎలా ఉన్నది? ప్రాకారాలు మొదలైన వాటిని గురించి వివరంగా చెప్పు," అన్నాడు.





ఘ్నులూ మొదలైనవి. ద్వారాల వద్దా, నగర మధ్యంలోనూ యోధులైన రాక్షసులు కోట్ల సంఖ్యలో ఉన్నారు. అయితే నేను అగడ్తలను దాటే వంతెనలను ధ్వంసం చేసి, అగడ్తను పూడ్చాను. ప్రాకారాన్ని ధ్వంసం చేశాను. చాలా మంది పరాక్రమ వంతులైన రాక్షసులను చంపాను. కనుక ఇప్పుడు లంకను వశపరచుకొనటం అంత కష్టం కాదు. మిగతా సైన్యంతో కూడా పని లేదు; అంగదుడూ, ద్వివిదుడూ, మైందుడూ, జాంబవంతుడూ, పనసుడూ, నళుడూ, సేనానాయకుడైన నీలుడూ చాలు. వీళ్ళు తలుచుకుంటే లంకను పెళ్ళగించి, రాక్షసులతో సహా తేగలరు. అందుచేత అంగదుడు మొదలైన వారిని ఆజ్ఞాపించి, మంచి ముహూర్తం చూసి బయలుదేర దీయించు.''

రాముడంతా విని హనుమంతుడితో, "సరే, ఆ లంకను అవశ్యం హత మార్చుదాం,'' అన్నాడు. అతను సుగ్రీవుడితో, "మనం ఇవాళే, ఇప్పుడే సేనలతో బయలుదేరి పోదాం. సరిగా మిట్టమధ్యాహ్న మయింది. ఇది అభిజిత్తు అనే ప్రశస్తమైన ముహూర్తం. కార్యసాధన అవుతుంది. అదీ గాక, ఇవాళ ఉత్తర ఫల్గునీ నక్షత్రం.



నా జన్మ నక్షత్రం పునర్వసు గనుక ఇది నాకు అనుకూలం. ఇంకా అనేక శుభ లక్షణాలు కనిపిస్తున్నాయి గనుక వెంటనే బయలుదేరుదాం,'' అన్నాడు.

వానరసేనలో ముందెవరుండాలో, దాని పార్శ్వాలను ఎవరు రక్షించాలో, ఏయే వానరయోధు డేయే పని నిర్వర్తించాలో, మార్గ మధ్యంలో శత్రువులు అవాంతరాలు కలిగించ కుండా ఎలా జాగ్రత్త పడాలో రాముడు వానర సేనానాయకుడైన నీలుడితో చెప్పాడు. ఉదాహరణకు, వానరసేన వెళ్ళే మార్గంలో ఉండే పళ్ళూ, ఫలాలూ మొదలైన ఆహారాన్ని రాక్షసులు నిర్మూ





లించవచ్చు. లోయలలోనూ, నదులు దాటే చోటా, అరణ్యాలలోనూ శత్రువులు మాటు వేసి ఉండి వానరసేనను నిర్మూలించ యత్నించవచ్చు. అలాటి ప్రమాదాలేవీ జరగకుండా ముందు నడిచే వారు జాగ్రత్త తీసుకోవాలి.

ప్రయాణం కావలిసిందని సుగ్రీవు డాజ్ఞా పించగానే యుద్ధోత్సాహులైన వానరులు గుహల నుంచీ, కొండల మీది నుంచీ, చెట్ల మీది నుంచీ దూకుతూ వచ్చారు. వానర సేన దక్షిణంగా కదిలింది. రాముణ్ణి హను మంతుడూ, లక్ష్మణుణ్ణి అంగదుడూ తమ భుజాల పైన ఎక్కించుకున్నారు. అసం ఖ్యాకులైన వానరులు వారిని చుట్టుముట్టి నడుస్తూ, ఎగిరారు, గంతులు వేశారు, సింహ నాదాలు చేశారు, ఒకరి నొకరు పడదోసు కున్నారు, పరుగుపందాలు వేసుకున్నారు, "రావణుణ్ణి చంపాలి; రాక్షసులను చంపాలి," అని నినాదాలు చేశారు. మహా పరాక్రమవంతులైన వానరోత్తములు, ఋష భుడూ, నీలుడూ, కుముదుడూ పెద్ద బల గంతో సేనకు ముందుండి దారి తీశారు.

దారిలో లక్ష్మణుడు రాముడికి ఉత్సాహం కలిగిస్తూ, "ఇంక త్వరలోనే రావణుడు చస్తాడు. సీతకు విమోచనం కలుగుతుంది. మీ ఇద్దరూ అయోధ్యకు తిరిగిపోతారు. వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది, నక్ష త్రాలు అనుకూలంగా ఉన్నాయి. రాక్షసుల నక్షత్రమైన మూలా నక్షత్రాన్ని తోకచుక్క తాకుతున్నది," అన్నాడు.

దారి పొడుగునా వానరులు చేయవలసిన కోతి చేష్టలన్నీ చేస్తూ, చెట్ల మీదుగానూ, చెట్ల కిందుగానూ నడుస్తూ, కుప్పి గంతులు వేస్తూ, ఎగురుతూ, కిచకిచలాడుతూ, చెట్ల కొమ్మలు విరుస్తూ, ఫలాలు తిని తేనెలు తాగుతూ, ఎక్కడా మజిలీ వెయ్యకుండా, సహ్యపర్వతాన్నీ, మలయపర్వతాన్నీ దాటి సముద్రతీరాన్ని చేరుకున్నారు.



రాముడు లక్ష్మణ సుగ్రీవులతో సహ మహేంద్రగిరి శిఖరానికి ఎక్కి, అక్కడి నుంచి సముద్రాన్ని చూశాడు. తరవాత పర్వతం దిగివచ్చి సముద్రాన్ని దగ్గిరగా చూశాడు. అతను సుగ్రీవుడితో, "ఇక మన ముందు సముద్రమే గాని భూమి లేదు. దీన్ని దాటటానికి ఏదో ఉపాయం ఆలోచించాలనుకున్నామే, ఆ ఉపాయం ఆలోచించే సమయం వచ్చింది. ప్రస్తుతానికి సేనలను ఇక్కడే విడియిద్దాం. ఎవరూ తన సేన నుంచి దూరంగా వెళ్ళరాదు. శత్రు భయం కలగకుండా శూరులైన వానరులు కాపలా తిరుగుతూ ఉండాలి," అన్నాడు.

సుగ్రీవుడు ఆజ్ఞాపించగా వానరసేన మూడు విభాగలై విడిసింది. ఆ సమయంలో వానరులు చేసిన ధ్వని మూలాన సముద్రఘోష కూడా విన రాలేదు. వానరులు సముద్రాన్ని చూసి మహాశ్చర్యం పొందారు. దీన్ని ఎలా దాటటమా అని దిగులు చెందారు.

వానరసైనాని అయిన నీలుడు సేనానివేశనం శాస్త్రోక్తంగా జరిపించాడు. వానరోత్తములైన మైందద్వివిదులు సేనకు రక్షకులుగా రెండు పక్కలా సంచరించారు.

సైన్యం విడిసే ఏర్పాట్లు పూర్తికాగానే రాముడు సీతా విరహంలో పడి చాలాసేపు తపన పడ్డాడు. అతను లక్ష్మణుడితో తన బాధ చెప్పుకుని విలపించాడు. ఇంతలో సూర్యాస్తమయమయింది. లక్ష్మణుడు ఓదార్చిన మీదట రాముడు వ్యాకుల మనస్సుతోటే సంధ్యోపాసన చేశాడు...

ఈ లోపల అక్కడ లంకలో, రావణుడు ఘోరమైన అవమానం పొంది తన రాక్షస ప్రముఖులతో, "శత్రువులకు అభేద్యమైన లంకలోకి ఒక వానరమాత్రుడు ప్రవేశించి, గొప్ప గొప్ప రాక్షస వీరులను చంపి, లంకను దహించి అల్లకల్లోలం చేసేశాడు; సీతతో మాట్లాడి మరీ వెళ్ళాడు. ఇప్పుడు రాముడు

వేలకొద్దీ వానరవీరులను వెంటబెట్టుకుని మన పైకి ఎత్తి వస్తున్నాడు. అతను తన తమ్ముడితోనూ, సుగ్రీవుడు మొదలైన వారితోనూ, వానరసేనతోనూ సముద్రాన్ని దాటి రాగలడనటానికి సందేహం అక్కర్లేదు. అతను స్వశక్తి చేత సముద్రాన్ని ఎండించవచ్చు, లేక మరొకటి చేయవచ్చు. అతను వానరబలగంతో వచ్చిపడే పక్షంలో మనం లంకనూ, మననూ రక్షించుకునే ఉపాయమేమిటి? అందరూ శాస్త్రీయంగా ఆలోచించి, ఏకాభిప్రాయానికి వచ్చి కర్తవ్యం నిర్ణయించండి," అన్నాడు.



ఈ మాటలు విని రాక్షసులు, "రాక్షసేశ్వరా, నీకి విషయమై చింత ఎలా కలిగింది? మనకు అంతులేని సేన ఉన్నది; అంతులేని పరిఘలూ, శక్తులూ, శూలాలూ, పట్టిసాలూ మొదలైన ఆయుధాలున్నాయి. నీవా ముల్లోకాలనూ జయించినవాడవు. కుబేరుణ్ణీ, యక్షులనూ జయించి పుష్పకం తెచ్చుకున్నావు. మయుడు నీకు వెరిచి తన కూతురును (మందోదరిని) నీకు భార్యగా ఇచ్చాడు. వాసుకీ, తక్షకుడూ మొదలైన నాగరాజులు నీకు లోబడ్డారు. అపారశక్తివంతులూ, మాయావులూ అయిన కాలకేయులు నీతో ఏడాది పాటు యుద్ధం చేసి చివరకు ఓడారు. వరుణుడూ, యముడూ నీ చేత జయించబడ్డారు. రాముడు వారితో పోల్చితే ఏపాటి? వారందరినీ జయించిన నీకు రాముడొక లెక్కా? నీ దాకా ఎందుకు? మహేశ్వర యజ్ఞం చేసి, వరప్రసాదుడై, దేవేంద్రుడితో యుద్ధం చేసి, అతన్ని కట్టి లంకకు తెచ్చిన ఇంద్రజిత్తు చాలడా? క్షణంలో ఆ రాముణ్ణీ, వానర సేననూ మట్టుబెట్ట గలడు! వానరుడైన హనుమంతుడు చేసిన అల్లరిని తలచి బాధపడకు, ఆ సంగతి మరిచి పో!" అన్నారు. వారు అవివేకులు, మీదు మిక్కిలి శత్రుబలం ఏ మాత్రమూ ఎరగరు.

వెంటనే ప్రహస్తుడు లేచి రావణుడికి నమస్కారం చేసి, "దేవదానవ గంధర్వ పిశాచాదులకు భయపడని మనం కోతులకు భయపడతామా? మనని జయించే వారు లేరన్న అలక్ష్యంలో ఉన్న కారణం చేత హనుమంతుడు అల్లరి చేశాడుగాని, నేను జీవించి ఉండగా వాడు ప్రాణాలతో లంకను దాటునా? నన్ను ఆజ్ఞాపించు, భూమి మీద ఎక్కడా వానర మనేదీ మచ్చుకు కూడా లేకుండా చేసేస్తాను. లంకను కాపాడే పని నాకు వదిలెయ్యి!" అన్నాడు.

"హనుమంతుడు మనకూ, మన రాజుకూ చేసిన అవమానం నిజంగా క్షమించ రానిదే. నే నొక్కణ్ణే వెళ్ళి ఆ వానరుల నందరినీ చంపి వస్తాను," అన్నాడు దుర్ముఖుడు. వజ్రదంష్ట్రుడు కోపం వెళ్ళగక్కుతూ, ఇనుప గుదియ ఒకటి చేతబట్టి, "అర్ధ రాత్రివేళ దొంగలాగా వచ్చిన ఆ హనుమంతుడితో నేమిటి? నేను వెళ్ళి, నిజమైన శూరుడైన ఆ రాముణ్ణి లక్ష్మణ సుగ్రీవులతో సహా చంపేస్తాను. రాజా, మరొక మాట చెబుతాను. మనం శత్రువులను ఉపాయంతో జయించవచ్చు. కామరూపులైన మన రాక్షసులు వేల సంఖ్యలో మనుష్య రూపం ధరించి రాముడి వద్దకు వెళ్ళి, 'మమ్మల్ని భరతుడు పంపాడు, ఆయన పెద్ద సేనతో వస్తున్నాడు!' అని చెప్పాలి. రాముడు ఆ ఆశలో ఉండగా మనం ఇక్కడి నుంచి వెళ్ళి, వానరసేన అంతా నిర్మూలిస్తాం. రామలక్ష్మణులు అది చూసి గుండె పగిలి చస్తారు," అన్నాడు.

ఇదే విధంగా కుంభకర్ణుడి కొడుకు నికుంభుడు తా నొక్కడే వెళ్ళి వానర సేననూ, రామలక్ష్మణులనూ చంపి వస్తా నన్నాడు. వజ్రహను డనే వాడు వానరుల నందరినీ తిని వస్తా నన్నాడు. ఇంకా అనేక మంది రాక్షస వీరులు శత్రు నాశనానికి సన్నద్ధులై లేచి నిలబడ్డారు.






# బియ్యం దొంగ

పాపన్న భార్య మీనాక్షి పుట్టింట మగపిల్ల వాణ్ణి ప్రసవించింది. పాపన్న బండి తోలుకుని అత్తవారింటికి వెళ్ళి, పిల్లవాడికి జాతకర్మా, నామకరణమూ చేసి, మంచి రోజు చూసి భార్యా బిడ్డలతో తన బండిలోనే స్వగ్రామానికి బయలుదేరాడు.

వాళ్ళు చీకటిపడే సరికి ఒక బస్తీ చేరుకున్నారు. అక్కడే ఒకటి రెండు రోజులుండి, కావలిసిన వస్తు సామగ్రి కొనుక్కుందామన్నది మీనాక్షి. వారొక సత్రంలో దిగి, అందులో ఖాళీగా ఉన్న గది ఒకటి తీసుకున్నారు.

చీకటిలో పాపన్న సత్రం ముందున్న బావి వద్దకు వెళ్ళి చేతులూ, కాళ్ళూ కడుక్కుంటూండగా ఎవరో పరిగెత్తుకుంటూ వచ్చి, బావికి కొద్ది దూరంలో పడిపోయాడు. అతని భుజాన ఉన్న మూట కింద పడింది. పాపన్న ఆ మనిషిని లేవదీసి, పడిపోయిన మూట చేతపట్టుకుని, సత్రం గదిలోకి తీసుకుపోయాడు. ఆ మనిషి మోకాళ్ళూ, మోచేతులూ దోక్కుపోయి గాయాలయాయి.

"ఎవరు నీవు? ఈ గాయా లేమిటి? ఎందు కలా పరిగెత్తు కుంటూ వచ్చావు? నీకు వచ్చిన భయమేమిటి?" అని పాపన్న ఆ మనిషి నడిగాడు.

అందుకా మనిషి, "అయ్యా, నేనీ బియ్యం కొనుక్కుని వస్తూండగా రక్షకభటులు, 'దొంగ, దొంగ!' అని కేకలేస్తూ నా వెంట పడ్డారు. వారేం చేసి పోతారోనని సత్తువ కొద్దీ పరిగెత్తాను. రెండుచోట్ల పడిపోవటం వల్ల మోకాళ్ళూ, మోచేతులూ గాయపడ్డాయి. మా ఇల్లు ఎంతో దూరం లేదు. కాని, ఇంటికి పోతే ఆ రక్షకభటులు నా భార్యనూ, పిల్లలనూ పీడిస్తారేమోనని ఇటుగా పరిగెత్తుకొచ్చాను. ఇక నడిచే శక్తి కూడా లేదు. ఉదయం నుంచీ మా వాళ్ళకు



పచ్చి మంచినీళ్ళు తప్ప మరో ఆహారం లేదు. వాళ్ళు ఈ బియ్యం కోసం ఎదురు చూస్తూంటారు. ఏం చెయ్యను?" అని దీనంగా అన్నాడు.

పాపన్న అతనితో, "విచారించకు. కాస్సేపు ఇక్కడే విశ్రాంతి తీసుకో. నీ ఇల్లు గుర్తు చెప్పావంటే, ఈ మూటను నేనే తీసుకుపోయి మీ ఇంట ఇచ్చి వస్తాను," అని చెప్పాడు.

ఆ మనిషి దణ్ణంపెట్టి, "ఆ పని చేసి పెట్టండి, బాబూ. మీకు పుణ్యం ఉంటుంది," అన్నాడు. అతను తన ఇంటికి దారీ, గుర్తులూ చెప్పాడు.

పాపన్న మీనాక్షిని ఇవతలికి పిలిచి, "ఆ మనిషి గాయాలకు కాస్త నూనె రాచి, పసుపు అద్దు. అతని కోసం ఎవరన్నావస్తే అతని సంగతి మాత్రం చెప్పకు. అతనెవరంటే, 'మా మనిషే,' అని చెప్పు," అని రహస్యంగా చెప్పాడు. తరువాత అతను మూట తీసుకుని ఆ మనిషి చెప్పిన ఇంటికి బయలుదేరాడు.

అతను బయలుదేరిన కొద్దిసేపటికే రక్షక భటులు అటుగావచ్చి, వసారాలో నిలబడి ఉన్న మీనాక్షిని, "ఇటుగా ఎవరైనా ఎర్రని మూట పట్టుకుని పరిగెత్తుకుంటూ వచ్చారా?" అని అడిగారు.

"ఎవరూ రాలేదు," అన్నది మీనాక్షి.

భటులు గదిలోకి తొంగి చూశారు. ఎర్ర మూట ఎక్కడా కనిపించలేదు గాని, పైబట్ట ముసుగుతన్ని గదిలో ఒక పక్కగా పడుకుని ఉన్న మనిషి కనిపించాడు.

"ఆ మనిషి ఎవరు?" అని రక్షక భటులు మీనాక్షి నడిగారు.

"మా మనిషే. ఒంట్లో బాగాలేదు," అన్నది మీనాక్షి.

వాళ్ళు వెళ్ళిపోయారు. కాని అదే సమయంలో మరి ఇద్దరు రక్షక భటులకు పాపన్న దొరికాడు. వాళ్ళు మూటను

గుర్తించి, పాపన్నే దొంగ అనుకుని, అతన్ని మూటతోసహా, మూటను పోగొట్టుకున్న వాడి దగ్గిరికి తీసుకుపోయారు. ఆ మనిషి తన మూటను గుర్తించాడు గాని పాపన్నను గుర్తించ లేదు. తన బియ్యం మూటను మసక చీకట్లో ఎవరు కాజేసినదీ ఆ మనిషి చూడనైనా లేదు.

"ఎందుకు చేశావీ దొంగతనం?" అని పాపన్నను రక్షకభటు లడిగారు.

"నేనే దొంగతనమూ చెయ్యలేదు," అన్నాడు పాపన్న.

"చేసినదిగాక అబద్ధాలు కూడా ఆడతావా?" అంటూ రక్షక భటులు పాపన్నను తన్ని సావడికి తీసుకుపోయారు. దారిలో జనం పోగైనారు. వారిలో ఒకడు, "ఈ మనిషి చీకటి పడేవేళ సత్రంలో దిగిన మనిషి కాడూ?" అన్నాడు.

రక్షకభటులు పాపన్నను, "సత్రంలో బస చేశావా?" అని అడిగారు.

లేదని పాపన్న తల అడ్డంగా ఆడించాడు. తనను దొంగ అని పట్టుకున్నారన్న విచారం అతన్ని బాధించలేదు గాని, పొద్దుటి నుంచీ మాడుతున్న వాళ్ళకు బియ్యం మూట అందించలేక పోయానే అన్న బాధ అతన్ని పట్టుకున్నది.



రక్షక భటులు సావడికి తీసుకు పోయే దారిలో సత్రం దగ్గిరికి వచ్చి, వసారాలో నిలబడిన మీనాక్షిని చూసి, పాపన్నను చూపి, "ఈ మనిషి తెలుసునా?" అని అడిగారు.

"దొంగ అని పట్టుకున్నవాళ్ళు మీరు చేసేదేదో చేసుకుపోక, కనిపించిన వారినెల్లా ఆరా లడుగుతా రెందుకు?" అన్నాడు పాపన్న చిరాకుగా.

పాపన్న రక్షక భటుల వశంలో ఉండటం చూసి గతుక్కుమన్న మీనాక్షి భర్త హృదయం కనిపెట్టి, నిబ్బరంగా, "ఆయనెవరో నాకు తెలియదు," అన్నది.

రక్షకభటులు పాపన్నతో ముందుకు సాగారు. ఇదంతా గమనిస్తున్న అసలు దొంగ లోపలి నుంచి బయటికి వచ్చాడు. మీనాక్షి అతనితో, "మధ్య నువ్వెక్కడికి? అసలే ఒంట్లో బాగాలేని మనిషివి?" అన్నది.

"తల్లీ, నీవూ నీ భర్తా మనుషులు కారు, దేవతలు. నేనే దొంగను. పెళ్ళాం పిల్లలు ఆకలికి మాడుతుంటే చూడలేక దొంగతనానికి పాల్పడ్డాను. కాని నా బదులు నీ భర్తవంటి వాణ్ణి శిక్ష పడనిస్తానా? అంత నీచుణ్ణి కాను," అంటూ ఆ మనిషి కూడా సాపడి దగ్గిరికి బయలుదేరాడు.

కొత్వాలు పాపన్నను చూసి, "ఎవరు నీవు? నీ పేరేమిటి? ఊరేమిటి? ఎందుకు దొంగతనం చేశావు?" అని అడిగాడు.

"అయ్యా, నేను దొంగను కానని చెబితే మీ భటులు నమ్మలేదు. వారికి దొంగిలించిన సరుకు దొరికింది, నేను దొరికాను. ఎవరినో ఒకరిని శిక్షించటం మీ కర్తవ్యమైతే నన్ను శిక్షించండి. మిగిలిన వివరాలన్నీ దేనికి?" అన్నాడు పాపన్న.

ఇంతలో అసలు దొంగ వచ్చి, "అయ్యా, ఆయనను విడవండి! దొంగతనం చేసిన వాణ్ణి నేను," అన్నాడు.

"వీడెవడు?" అని కొత్వాలు రక్షకభటుల్ని అడిగాడు. తమకు తెలియదని వాళ్ళన్నారు.

"నువు దొంగవయితే ఈ మనిషి ఎవరు?" అని కొత్వాలు అడిగాడు.

"ఏమో, బాబూ. నే నీ ఊళ్ళోనే పుట్టి పెరిగాను గాని ఈ మనిషి నెన్నడూ చూడ లేదు. ఈ ఊరివాడు కాడు," అన్నాడు దొంగ.

కొత్వాలు చిరాకుపడి, "మీరిద్దరూ నా ముందు నుంచి పొండి," అని కసిరి, రక్షకభటులతో, "దొంగ వచ్చి తనంతట తాను నేనే దొంగను అని చెప్పుకోవలసివస్తే ఇంక మీరెందుకూ?" అన్నాడు. రక్షకభటులు ఏమీ బదులు చెప్పలేకపోయారు.



# 31. ప్రాచీన మాయా స్తంభం

కొలంబసు అమెరికా ఖండాన్ని కనిపెట్టటానికి చాలా పూర్వమే అక్కడ ఒక గొప్ప నాగరికత పరిణతి చెంది శిథిలం కూడా అయిపోయింది. అదే మాయా నాగరికత. ఎర్ర ఇండియను లన బడే వారు ఆ నాగరికతకు వారసులు. వీరి భాష కూడా మాయా భాషకు దగ్గిరగా ఉంటుంది.

గ్వాటిమాలా, దక్షిణ మెక్సికో, యుకటాన్, హొండ్యురాస్ మొదలైన దేశాలలో ప్రాచీన మాయా నగరాలు బయటపడ్డాయి. ఒకప్పు డవి ఉండిన చోట ఈ నాడు దట్టమైన అరణ్యా లున్నాయి. పురాతత్వ పరిశోధకులు ఈ మాయా నగరాలను శ్రద్ధగా తవ్వి, మాయా నాగరికతను గురించి పరిశోధనలు చేశారు. మాయా శిల్పాలను భద్రపరిచారు.

మాయా నాగరికత కేవలమూ వ్యవసాయాన్ని ఆధారం చేసుకుని అభివృద్ధి చెందింది. వారి జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానం నిర్దుష్టమైనదని చెప్ప బడుతున్నది.

ఈ పక్క చిత్రంలో కనబడే స్తంభం వెయ్యి సంవత్సరాల నాటిది. ఇప్పటికీ ఇది చెక్కుచెదర కుండా ఉన్నది. ఈనాడు కనిపించే మాయా స్తంభాలన్నిటి లోకీ ఇది ఎత్తయినది. దీని పరిస రాలలో అనేక మాయా నాగరికతా చిహ్నాలూ, చెక్కడాలూ, శిథిలగృహాలూ కనిపించాయి. ఇది పోర్టో బారియోస్ కూ, గ్వాటిమాలా నగరానికీ మధ్య గల రైలు మార్గానికి సమీపంలో ఉన్నది.



Photo by Bhalchandra Kadne



బహుమతి
పొందిన వ్యాఖ్య

చల్లని గాలికి

పంపినవారు :
ఎ. గోపాలరావు, విజయవాడ

Chandamama, June '64

Photo by Bhalchandra Kadne



బహుమతి
పొందిన వ్యాఖ్య

వాలేము నేలకి

పంపినవారు :
ఎ. గోపాలరావు, విజయవాడ

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1964 ఆగష్టు నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చల్లని గాలికి

రెండవ ఫోటో : వాలేము నేలకి

పంపినవారు : ఎ. గోపాలరావు,

పవర్‌హౌస్, విజయవాడ—1

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd. and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



# మీ బిడ్డ పెరుగుదలను అరికట్టే అజీర్తిని అలక్ష్యం చెయ్యకండి!

## అమృతాంజన్
లిమిటెడ్ వారి
## గ్రైప్ మిక్శ్చర్




మీ బిడ్డ పాకటం, కూచోటం, నిలబడటం, నడవటం నేర్చుకోవాలి, తూకం రెట్టింపు పెరగాలి-అన్నీ తొలి యేడాదిలో! మీ బిడ్డ ఆరోగ్యంగా పెరగటానికి జీర్ణశక్తిలో స్వల్పలోపం కూడా అభ్యంతరం కలిగించకుండా మీరు శ్రద్ధ వహించాలి.

అజీర్ణ సూచన కనిపించగానే మీ బిడ్డకు అమృతాంజన్ గ్రైప్ మిక్శ్చర్ ఇవ్వండి. దానివల్ల, పళ్లు వచ్చేటప్పుడు కూడా ఏమీ చిరాకు కలగకుండా ఉంటుంది.

జ్ఞాపకం ఉంచుకోండి, అమృతాంజన్ గ్రైప్ మిక్శ్చర్ తయారు చేస్తున్నవారు సుప్రసిద్ధమైన నొప్పుల నివారిణి అమృతాంజన్ తయారు చేసే వారే. మీరు నిస్సందేహంగా వాడవచ్చు.

అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు, బొంబాయి, కలకత్తా, న్యూ ఢిల్లీ

JWT/AM/G/2615 A

★

మీరు మీ ఊరిలో మా "చందమామ" అమ్మే చిన్న ఏజంటుగా ఉండవచ్చును. దీనికి మీరు మనిఆర్డరు ద్వారా రు. 3-60 పంపిన 8 "చందమామ" కాపీలు మీకు సప్లయి చేస్తాము. లేదా ప్రారంభంలో 4 కాపీలు మాత్రం చాలంటే రు. 1-80 పంపండి. ప్రతి ఒక్కొంటికి 15 న.పై. చొప్పున మీకు లాభిస్తుంది. అయితే డబ్బు పంపే ముందు మీ ఊరిలో ఇప్పటికే మా ఏజంటు ఎవరూ లేరు అనే విషయం ధృఢిచేసుకోండి.

★

చందమామ పబ్లికేషన్సు

వడపళని :: మందరాసు - 26

★

85

